# రిపబ్లిక్ దినోత్సవాలు

## 1970



రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఢిల్లీలో ఏర్పాటుచేసిన "పొథార్ థోలా" జానపద నృత్య కళాకారులతో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ



సికిందరాబాదు పెరేడ్ మైదానంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరు వందనం స్వీకరిస్తున్న దృశ్యం



ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ సికిందరాబాదు పెరేడ్ మైదానంలో ప్రసంగిస్తున్న దృశ్యం



రిపబ్లిక్ దినోత్సవంనాడు గవర్నరు పెరేడ్ తిలకిస్తున్న దృశ్యం

# ఆంధ్రప్రదేశ్



సంపుటి: 14 మార్చి 1970 సంచిక: 5
ఫాల్గుణం-చైత్రం-1891-92 శా.శ

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు




వచ్చే సంచిక

ఉగాది ప్రత్యేక సంచిక

అనేక అందాలతో

ఆకర్షణలతో

*

కొత్త సీరియల్

" మన చరిత్ర-సంస్కృతి "

వెల: 50 పైసలు

సాలుచందా ఆరు రూపాయలు

Regd. No. H. 135.

ఈ సంచికలో రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పని సరిగా ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించనక్కరలేదు.

పేజీ

# కష్టపడి పనిచేయ వలసిన సమయం

ఫిబ్రవరి, మార్చి నెలలు రాష్ట్రాలలోనే కాదు, కేంద్రంలో కూడా ఎప్పుడూ హడావిడిగా వుండే నెలలు. వివిధ రాష్ట్రాల అసెంబ్లీలలోనూ, పార్లమెంటులోనూ బడ్జెట్ సమావేశాలు ఫిబ్రవరి నెలలో ప్రారంభమై, మార్చి నెలాఖరు వరకూ, పార్లమెంటు విషయంలో యింకా తరువాత కాలంలో కూడా కొనసాగుతూ వుంటాయి. ఆర్థిక సంవత్సరం ముగిసే సమయం కాబట్టి అనేక విచిత్రమైన సమస్యలు ఎదురవుతూ వుంటాయి. సకాలంలో, ఆర్థిక విషయాల్లో ప్రభుత్వామోదం పొందడానికీ, కేటాయించిన డబ్బు మురిగి పోకుండా ఖర్చుచేయడానికీ ఎక్కడలేని తొందరతో పనులు సాగుతూవుంటాయి. ప్రతి రాష్ట్రంలోనూ యిదే జరుగుతుంటుంది. వేసవి ప్రారంభమయ్యే కాలం కూడా యిదే. విద్యార్థులు తమ భవిష్యత్తును నిర్ణయించే పరీక్షల కోసం కష్టపడి చదవడం ప్రారంభిస్తారు. అంటే ఎక్కడ చూసినా పని సంరంభం, ఆచరణ, దీక్ష కనిపించే సమయం యిది.

తెలంగాణా ప్రాంతీయ సంఘానికి అదనపు అధికారాలను యిస్తూ భారత ప్రభుత్వం చేసిన ప్రకటన తెలంగాణా అభివృద్ధి చరిత్రలో ఒక ప్రధానమైన ఘట్టం. ఈ ప్రకటన, ప్రధాన మంత్రి అష్టసూత్ర ప్రణాళిక అమలు పరిచే కార్యక్రమంలో భాగంగా చేయబడింది.

ఏ రాష్ట్రంలోనైనా బడ్జెట్, ఆ రాష్ట్రపు ఆర్థిక వ్యవస్థకూ, సాధించిన విజయాలకూ, సాధించ దల చిన అభివృద్ధికీ సూచనప్రాయంగా వుంటుంది. రు. 265.96 కోట్ల బడ్జెట్ ప్రతిపాదించారంటే, కొన్ని అవరోధాలు వున్నప్పటికీ, రాష్ట్రపు ఆదాయం పెరుగుతున్న విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఆంధ్ర ప్రాంతంలో మద్యనిషేధం తొలగించిన ఫలితంగా రాష్ట్ర ఆదాయం బాగా మెరుగుపడే అవకాశమూ, తత్ఫలితంగా అభివృద్ధి కార్యక్రమాలకు తగినంత మొత్తాలలో కేటాయింపులు చేసుకునే అవకాశమూ కలుగుతున్నాయి. కొత్తగా ఒంగోలు జిల్లాను ఏర్పాటు చేయడం ఒక ముఖ్యమైన విషయం, బడ్జెట్ ప్రసంగంలో ఆర్థిక మంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డిగారు పేర్కొన్నట్లు, ఆ ప్రాంత ప్రజల చిరకాల వాంఛితం నేటికి యీడేరింది. కొత్త జిల్లాలో చేర్చబడిన, కర్నూలు, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు చెందిన ప్రాంతాల విషయంలో యితోధికంగా శ్రద్ధ వహించడానికి యీ కొత్త జిల్లా ఏర్పాటు ఉపయోగపడుతుంది.

రెండుసార్లు తుఫాను తాకిడికి గురిఅయినా, రాయలసీమలో కొరత పరిస్థితి ఏర్పడినా, ఆందోళన కారణంగా తెలంగాణాలో ఆర్థిక వ్యవస్థ దెబ్బతిన్నా, ఆర్థిక మంత్రి ప్రతిపాదించిన ఆర్థిక పరిస్థితి చిత్రణ నిరాశాజనకంగాలేదు. పైగా, యిది యిబ్బందులను ఎదుర్కొవాలనీ, ఏ పరిస్థితులలోనైనా సరే, వ్యవసాయ పారిశ్రామిక ప్రగతిని కుంటుపడనీయకుండా చేయడానికి సకల ప్రయత్నాలు చేయాలనే ప్రభుత్వ దృఢసంకల్పానికి దర్పణంగా వున్నది. భూమిలేనివారికి బంజర్లను పంపిణీచేసే విషయంలోనూ, భూసంస్కరణలను త్వరితం చేసే విషయంలోనూ ప్రభుత్వ విధానాన్ని సూచిస్తూ ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిగారు చేసిన స్పష్టమైన ప్రకటన ప్రజలలో కొత్త ఆశలను రేకెత్తిస్తున్నది.

గుంటూరు జిల్లా అగ్నిగుండాలలో సీసము, రాగి, తుత్తునాగం గనుల త్రవ్వకానికి కేంద్ర ప్రభుత్వ గనులు, లోహ విషయాల స్టేట్ మంత్రి శ్రీ ఆర్. జగన్నాథరావుగారు ప్రారంభోత్సవం చేయడం మన రాష్ట్రపు పారిశ్రామిక ప్రగతి కృషిలో అతి ప్రధానమైన ఘట్టం, ఈ ప్రాజెక్టువల్ల ఒక వెనుకబడిన ప్రాంతానికి కొత్తగా అభివృద్ధి అవకాశాలు ఏర్పడుతాయి. ఆ ప్రాంతపు పారిశ్రామిక అభివృద్ధిలో యీ ప్రాజెక్టు ప్రధానాంశంగా వుంటుంది. హైదరాబాదు నగరానికి టెలికమ్యూనికేషన్ కేబిల్ ఫ్యాక్టరీని తిరిగి సాధించుకోవడంలోనూ విశాఖ పట్టణానికి దాదాపు విరమించబడినట్లు భావించబడిన జింకుశుద్ధి కార్మాగారం తెచ్చుకోవడంలోనూ ప్రభుత్వం చేసిన కృషి శ్లాఘనీయం. తూర్పు తీరంలో, నెల్లూరు జిల్లాలోని శ్రీహరికోట ద్వీపంలో రాకెట్ ప్రయోగ కేంద్రాన్ని ఏర్పాటు చేయడంవల్లనూ, రామగుండంలో బొగ్గు ప్రాతిపదికగాగల రసాయనిక ఎరువుల ఫ్యాక్టరీని స్థాపించుకొని, తత్ఫలితంగా అనేక యితర పరిశ్రమలను నెలకొల్పుకొనడం వల్లనూ, రాష్ట్ర ప్రగతి కార్యక్రమం ఉచ్చ దశను అందుకుంటుందనడంలో సందేహం లేదు. రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలోని ఖనిజ సంపదనూ, సర్కారు జిల్లాలలోని వ్యవసాయ సంపదనూ దీక్షతో, ఏకీకృత లక్ష్యంతో, సక్రమంగా అభివృద్ధి పరచుకున్నట్లయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో బహుముఖ ప్రగతి కృషితో కూడిన నూతన శకానికి అంకురార్పణ జరుగుతుంది.

—పి. వి. ఆర్.

1970 ఫిబ్రవరి 7వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ శాసన (ఉభయ) సభల సంయుక్త సమావేశంలో చేసిన ప్రసంగం పూర్తిపాఠం :



# తెలంగాణా అభివృద్ధి: భూసంస్కరణలు ఉద్యోగుల సమస్యలు

గౌరవనీయులైన అధ్యక్షా ! సభాపతీ !
శాసనమండలి సభ్యులారా !

గతపర్యాయం మనం 1969 ఆగస్టు మధ్యలో సమావేశమయినాం. ప్రభుత్వ విధానానికి సంబంధించి, అటుపిమ్మట జరిగిన ముఖ్యసంఘటనలను గురించి ఇప్పుడు సంగ్రహంగా వివరిస్తాను. ప్రస్తుత సమావేశం కార్యక్రమంలోని ప్రధాన అంశాలను గురించి కూడ తెలియజేస్తాను.

క్రిందటి నా ప్రసంగంలో గుంటూరు, కృష్ణా, ఖమ్మం, పశ్చిమ గోదావరి జిల్లాలకు 1969 మే నెలలో సంభవించిన తుఫాను వల్ల కలిగిన అపారనష్టం గురించి ప్రస్తావించి వున్నాను. ఈ ప్రాంతాలు ఆ విపత్తునుండి కోలుకొనక పూర్వమే 1969 అక్టోబరు నవంబరు మాసాలలో భారీ వర్షాలతో కూడిన మరొక తుఫాను వచ్చింది. ఈ తుఫాను, పైన తెలిపిన ప్రాంతాలతోపాటు వాటికి ఉత్తరంగాను. దక్షిణంగాను ఉన్న శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, నెల్లూరు జిల్లాలనుకూడా బీభత్సానికి గురిచేసింది. కెరటపునీరు మూలంగాను, ముంపునీటి మూలంగాను కోస్తా ప్రదేశమూ, కొల్లేరు ప్రాంతమూ విపరీతమైననష్టానికి గురిఅయ్యాయి. మొత్తంమీద 5 లక్షల మంది ఇబ్బందుల పాలయ్యారు, సుమారు 250 మంది ప్రాణాలు కోల్పోయారు. ప్రభుత్వ ఆస్తులకు, ప్రజల ఆస్తులకు భారీనష్టం సంభవించింది.

ఈ తుఫానువల్ల డెల్టా జిల్లాలలో ఖరీఫ్‌పంట బాగా నష్టమయింది. పంటకు ఏవో కొలదిపాటి అవకాశాలు మిగిలివున్నా, ఈ జిల్లాలలో డిశెంబరు నెలలో వచ్చిన అకాలమైన భారీ వర్షాలు వాటిని పూర్తిగా తుడిచిపెట్టినాయి. వివిధమైన పంటలతోవున్న సుమారు 30 లక్షల ఎకరాలు దెబ్బతిన్నాయి, ఒక్క వరి విషయంలోనే 3 లక్షల ఎకరాల పంట పూర్తిగా నష్టమయింది. 18 లక్షల ఎకరాలలో పంట దిగుబడి బాగా దెబ్బతిన్నది. అరటి, తమలపాకు పసుపు పంటలు పూర్తిగా ధ్వంసమయ్యాయి. కొబ్బరితోటలు, పొగాకు, మిర్చి వంటి వాణిజ్యపంటలు కూడ ఎక్కువగా దెబ్బతిన్నాయి.

ప్రభుత్వం సమగ్రమైన ఒక సహాయ కార్యక్రమాన్ని మంజూరు చేసింది. దెబ్బతిన్న ఇండ్ల యజమానులకు నగదు సహాయం, బెస్తలకూ, నేత పనివారికీ ప్రత్యేక గ్రాంట్లు, రైతులకు ఋణాలు ఈ కార్యక్రమం క్రింద ఏర్పాటు చేయబడాయి. తుఫాను మూలంగా దెబ్బతిన్న నీటిపారుదల, మురుగుపారుదల వరద

నియంత్రణ నిర్మాణాలకు, రోడ్లకు, భవనాలకు మరమ్మత్తులుకూడా చేపట్టబడ్డాయి. ఈ సహాయక, మరమ్మత్తు పనులకు సుమారు 18 కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని అంచనా వేయబడింది. కేంద్ర ప్రభుత్వం ఔదార్యంతో అందజేసిన ఆర్థిక సహాయంతో ఈ పనులు చేపట్టబడుతున్నాయి.

మనకు జ్ఞాపకం ఉన్నంతవరకు మున్నెన్నడూ, రాష్ట్రంలోని తీరప్రాంతాలు వరుసగా ఇన్ని ప్రకృతి విపత్తులకు లోను కాలేదు. అయినప్పటికి స్థానికప్రజలు గొప్ప ధైర్యస్థైర్యాలతో పరిస్థితిని ఎదుర్కొన్నారు. త్వరలో ఈ ప్రాంతపు ఆర్థిక పరిస్థితి కుదుటపడగలదని నా విశ్వాసము.

## భూ సంస్కరణలు

భూమిలేని పేదలకు ప్రభుత్వ బంజరుభూముల పంపకం అన్నది ప్రభుత్వ భూ విధానంలో ఒక ప్రధానాంశంగా ఉన్న విషయం గౌరవ సభ్యులకు తెలిసినదే. ఈ భూముల పంపిణీని త్వరితం చేయడంకోసం ప్రభుత్వం 1969 నవంబరు 1వ తేదీ నుండి ప్రత్యేక కార్యక్రమాన్ని ప్రవేశపెట్టినది భూములను శీఘ్రగతిని కేటాయించడంకోసం ఉద్దేశించబడిన ఈ కార్యక్రమం క్రింద గ్రామ, తాలూకాస్థాయిలలో సంఘాలను ఏర్పాటుచేయడానికి, స్థానిక నాయకులకు, ప్రతినిధులకు వాటిలో స్థానం కల్పించడానికికూడా అవకాశం ఉన్నది. ఈ కార్యక్రమం క్రింద ఇంత వరకు 2 లక్షల ఎకరాలకు పైగా భూముల కేటాయింపు జరిగింది. రానున్న మాసాలలో ఇంకా ఎక్కువగా భూముల పంపకం జరుగగలదని ఆశించబడుతున్నది.

మరికొన్ని భూ సంస్కరణ చర్యలను అమలుజరిపే విషయాన్ని గూర్చి ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తున్నది. విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలలోను, ఖమ్మంజిల్లా భద్రాచలం ప్రాంతంలోను అమలునందున్న ముఠాదారీ, మాలుజారీ పద్ధతులను రద్దుచేయడానికి నిబంధనలు చేయబడ్డాయి. దీనితో రాష్ట్రంలో మధ్యవర్తి పద్ధతుల రద్దుకు చర్యలు తీసుకోవడం పూర్తిఅయింది. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కమతాలపై గరిష్ఠ పరిమితుల చట్టం క్రింద మిగులు భూములను స్వాధీనం చేసుకొనే కార్యక్రమం కూడా 1970–71 వార్షిక ప్రణాళికలో చేర్చబడుతున్నది. కౌలుదారు చెల్లించవలసిన కౌలు మొత్తాలను తగ్గించడానికి, వారికి ఇతరమైన మరికొన్ని ప్రయోజనాలు కల్పించడానికిగాను రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలోగల కౌలుదారీ శాసనాన్ని తగురీతిగా సవరించాలని, ఇందుకోసం ప్రస్తుత సమావేశంలో ఒక శాసనం తేవాలనికూడా ప్రభుత్వం నిశ్చయించింది.

## తెలంగాణా అభివృద్ధి

తెలంగాణ ప్రాంతప్రజల న్యాయమైన ప్రయోజనాలను కాపాడాలని, ఆ ప్రాంతపు అభివృద్ధిని త్వరితగతిని సాధించాలని ఈ విషయంలో ప్రధానమంత్రి ప్రకటించిన అష్టసూత్ర కార్యక్రమాన్ని అమలు పరచాలని ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉన్నట్లు క్రిందటి ప్రసంగంలో తెలియపరచి వున్నాను. ఈ అష్టసూత్ర కార్యక్రమాన్ని పురస్కరించుకొని చేపట్టిన వివిధ చర్యలు అమలు జరుగుతున్నాయి. సాధ్యమైనంత సత్వరంగా ఈ కార్యక్రమాన్ని పూర్తిచేయాలని ప్రభుత్వం ఆతురతతో ఉన్నది ముఖ్యంగా తెలంగాణా మిగులు నిధులను గురించీ, ప్రాంతీయ సంఘ అధికారాల విస్తరణ గురించీ కేంద్రప్రభుత్వ నిర్ణయాలకోసం ప్రభుత్వం ఎదురుచూస్తున్నది.

## ఉద్యోగుల సమస్యలు

నా గత ప్రసంగంలో కేంద్ర రాష్ట్రసలహా సంఘాలను గురించి ప్రస్తావించి ఉన్నాను. పదవుల సమానీకరణ, సామాన్య శ్రేణీకరణ జాబితాల తయారీ మున్నగు విషయాలకు సంబంధించి 886 మంది గెజిటెడు అధికార్లు, 2,718 మంది నాన్ గెజిటెడు ఉద్యోగులు పెట్టుకున్న విజ్ఞప్తులను పై తెలిపిన సంఘాలు పరిశీలించాయి. ఆ సంఘాల సిఫారసుల ప్రాతిపదికపై 630 మంది గెజిటెడు అధికార్ల విషయంలోను, 2,493 మంది నాన్ గెజిటెడు ఉద్యోగుల విషయంలోను కేంద్రప్రభుత్వం తన నిర్ణయాలను తెలియపరచింది. ఆ నిర్ణయాల ననుసరించి రాష్ట్ర ప్రభుత్వం చర్య తీసుకుంటున్నది. 2,182 మంది గెజిటెడు అధికార్ల విషయంలోను, 15,947 మంది నాన్ గెజిటెడు ఉద్యోగుల విషయంలోను సామాన్య శ్రేణీకరణ జాబితాలను తయారుచేయడం పూర్తయింది. ఇక 1 374 మంది గెజిటెడు అధికార్లు, 134 మంది నాన్ గెజిటెడు ఉద్యోగుల విషయంలో మాత్రమే విలీనం జరుగవలసి ఉన్నది.

ఇంతేకాకుండా రిటైరయిన హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అధ్యక్షతన ఒక ఉన్నతాధికార సంఘంకూడా ఏర్పాటుచేయబడింది ఉద్యోగాల సమానీకరణకు, సర్వీసుల విలీనానికి సంబంధించి ఏవేని కేంద్ర ప్రభుత్వం ఆదేశాలను అమలుపరచకపోవటం, నియామకాలు, ప్రమోషన్లు, వేతనం మొదలైనవాటి విషయములో ఏవేని ప్రత్యేక నిబంధనలను పాటించకపోవడం మూలంగా ఉత్పన్నమయ్యే తెలంగాణా ఉద్యోగుల ఇబ్బందులను ఈ సంఘం పరిశీలిస్తుంది.

## షెడ్యూల్డు ప్రాంతాలు

షెడ్యూల్డు ప్రాంతాల అభివృద్ధి, షెడ్యూల్డు తెగల సంక్షేమం శీఘ్రతరంగా సాధించడం ఎలా అనే విషయం గూర్చి రాష్ట్ర ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నది. రాష్ట్రంలో ఆదివాసుల అభివృద్ధికోసం ఒక సమగ్ర ప్రణాళిక చేపట్టే నిమిత్తం నాలవ ప్రణాళికలో ప్రత్యేకంగా కొంత మొత్తాన్ని కేటాయించాలని ప్రభుత్వం సంకల్పించింది.

షెడ్యూల్డు ప్రాంతాలలో ఆదివాసేతర ప్రజలు ఆదివాసులను తమ స్వప్రయోజనాలకు వినియోగించుకోకుండా చూడడంకోసం ఈ ప్రాంతాలలో ఆదివాసేతరులకు భూములను బదిలీచేసే విషయమై మరి కొన్ని నిర్బంధాలు విధిస్తూ రెగ్యులేషను ఒకటి చేయబడింది. ఆదివాసుల రుణ భారాన్ని తగ్గించడానికి, అలా తగ్గించ

బడిన రుణాలకు సంబంధించి అప్పు చెల్లింపుదల చేయడానికి నిబంధన చేసే మరో రెగ్యులేషనుకు రాష్ట్రపతి ఆమోదం లభించవలసి వున్నది. రాష్ట్రమందలి అన్ని షెడ్యూల్డు ప్రాంతాలలోను ఆదివాసేతరులకు ప్రభుత్వ భూముల కేటాయింపును నిషేధిస్తూ ప్రభుత్వం ఉత్తరువులను కూడ జారీచేసింది.

## నక్సలైట్లు

నక్సలైట్లు, తీవ్రవాదుల మూలంగా రాష్ట్రంలో శాంతి భద్రతలకు వాటిల్లిన ముప్పును గురించి నేను లోగడ చేసిన ప్రసంగంలో క్లుప్తంగా పేర్కొన్నారు. ఈ వర్గాలకు చెందిన పెక్కుమంది అగ్రనాయకులు, వారి అనుచరులు మన పోలీసు దళంతో తలపడినపుడు పట్టుబడ్డారు. అంతేకాక ఈ ఉద్యమానికి చెందిన అనేకమంది ఇతర నాయకులను నిర్వాహకులను రాష్ట్రమందలి వివిధ ప్రాంతాలలో నిర్బంధంలోకి తీసుకోవడం జరిగింది. రాష్ట్ర వ్యాప్తంగా హింసా దౌర్జన్యకాండలను చెలరేగించడానికి ఈ వర్గాలవారు వేసుకొన్న పన్నుగడలను భగ్నం చేసేందుకు ఈ చర్యలు ఎంతగానో ఉపకరించాయని ప్రభుత్వం విశ్వసిస్తున్నది. మొత్తంమీద ఈ ఉద్యమం తగుముఖం పడుతూవున్నట్లు తెలుస్తున్నది. దాడి జరిగిన ప్రాంతాలలోని ప్రజలు ఆ దాడిని ఎదుర్కోవడంలో ప్రభుత్వాధికారులకు తోడ్పడేందుకు తమంతట తామే ఎక్కువ సంఖ్యలో ముందుకు వస్తున్నారు.

ఈ దౌర్జన్య వర్గాల బారినుండి సమాజాన్ని రక్షించే నిమిత్తం ప్రివెంటివ్ డిటెన్షను చట్టంలోని నిబంధనలను తప్పనిసరిగా వర్తింపచేయవలసి వచ్చింది. ప్రివెంటివ్ డిటెన్షను చట్టం కాలం ముగిసిన తరువాత, ప్రభుత్వం అదే విధమైన అధికారాలను కలిగివుండాల్సిన అగత్యం ఏర్పడింది. 1970 జనవరి 1 వ తేదీ నుండి అమలులోనికి వచ్చే విధంగా ప్రివెంటివ్ డిటెన్షనును నిబంధించే ఆర్డినెన్సు జారీచేయడం జరిగింది. ఆ ఆర్డినెన్సు స్థానే ప్రస్తుత సమావేశంలో ఒక బిల్లు ప్రవేశ పెట్టబడుతున్నది.

## ఆహార విధానం

దేశమంతటా ఆహార ధాన్యాల లభ్యత పరిస్థితి మెరుగైనందున, రాష్ట్రంలోని ఆహార ధాన్యాల వినియోగ అవసరాలను దృష్టియందుంచుకొని, ప్రభుత్వం ఇంతవరకు అనుసరిస్తున్న సేకరణ విధానాన్ని, రేషనింగు విధానాన్ని సమీక్షించింది. అందుమీదట రాష్ట్రంలో అమలునందున్న కంట్రోళ్ళ విధానాన్ని సరళీకరించదగిన సమయం ఆసన్నమైనట్లు ప్రభుత్వం అభిప్రాయపడింది. తదనుగుణంగా ఈ నెల నుండి రాష్ట్రం లోపలగల ఆహార మండలాల సంఖ్య ఆరునుండి రెండుకు తగ్గించబడింది. ఉత్పత్తిదార్ల లెవీ పద్ధతి రద్దుపరచబడింది. బియ్యపు మిల్లులపై లెవీ కొనసాగుతుంది. అయితే లెవీ పరిమాణం తగ్గించబడుతుంది. రేషనింగు తీసివేయబడుతుంది. కాని తక్కువ రాబడి వర్గాలవారి అవసరాలను తీర్చడంకోసం అవసరమైనచోట ఆహార ధాన్యాలు సరస ధర దుకాణాలద్వారా సరఫరా చేయబడతాయి.

## ఒంగోలు జిల్లా

గుంటూరు, కర్నూలు, నెల్లూరు జిల్లాలలో పని భారం అధికంగా ఉన్నది. అందుచేత ఆ జిల్లాలకు చేరిన ప్రాంతాలలో పరిపాలన, అభివృద్ధి మరింత ఉత్తమంగా జరిగేట్లు చూడటంకోసం ఈ మూడు జిల్లాలలో నుండి కొన్ని కొన్ని భాగాలను కలిపి క్రొత్తగా ఒంగోలు జిల్లాను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. రాష్ట్రంలో జనాభా లెక్కల సేకరణ కార్యక్రమం ప్రారంభమైవున్నందున, ఈ జిల్లాను వెంటనే ఏర్పాటుచేయవలసి వచ్చింది. 1970 ఫిబ్రవరి 2 వ తేదీనుండి క్రొత్తజిల్లాను ఏర్పాటు చేస్తూ ఒక ఆర్డినెన్సు స్థానే ప్రస్తుత శాసనమండలి సమావేశంలో ఒక బిల్లు ప్రవేశపెట్టబడుతుంది.

## క్రొత్తబిల్లులు

ఈ సమావేశంలో, 1970_71 సంవత్సరపు బడ్జెటునే కాకుండా ఈ క్రింద తెలుపబడిన వివిధ బిల్లులనుకూడా మీరు పరిశీలించగలరు:

1. 1969, ఆంధ్రప్రదేశ ప్రివెంటివ్ డిటెన్షను ఆర్డినెన్సు (1969 లో 6 వ ఆర్డినెన్సు) స్థానే బిల్లు;
2. 1970, ఆంధ్రప్రదేశ విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థల (అధి గ్రహణ) విస్తరణ మరియు సవరణ బిల్లు;
3. 1969, ఆంధ్రప్రదేశ సాధారణ అమ్మకపు పన్ను (సవరణ) బిల్లు (1969 లో 9వ శాసనసభ బిల్లు);
4. 1956, ఆంధ్రప్రదేశ (ఆంధ్రప్రాంతపు) కౌలుదారీ చట్టమునకు 1970 (సవరణ) బిల్లు;
5. 1970, గజపతి నగరం తాలూకా మరియు ఒంగోలు జిల్లా (ఏర్పాటు) బిల్లు

మీ సమాలోచనలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.





ఫిబ్రవరి 19వ తేదీన ఆర్థిక మంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి శాసనసభలో 1970-71 బడ్జెట్ ప్రతిపాదిస్తున్న దృశ్యం

# రాష్ట్ర బడ్జెట్: 1970-71

1969_70 లో సవరించిన అంచనాల ప్రకారం మొత్తం రివిన్యూ రూ. 255 కోట్లు. 1970_71 లో బడ్జెట్ అంచనాల ప్రకారం మొత్తం రివిన్యూ రూ. 265 96 కోట్లు. ఈ పెరుగుదలకు ముఖ్యకారణాలు_ ఆంధ్రప్రాంతంలో మద్యపాన నిషేధాన్ని రద్దుచేయటం వలన ఎక్సైజు క్రింద లభించిన అధిక ఆదాయమూ, కేంద్రపన్నుల్లో రాష్ట్రపు వాటా పెరగటమూనూ కేంద్రం ప్రతిపాదించే పథకాలకు లభించే రూ. 6.91కోట్ల గ్రాంటు, రాష్ట్రప్రణాళికకు కేంద్రం నుంచి లభించగల రూ.11 58 కోట్ల గ్రాంటు కూడా లెక్కలోకి తీసుకొనబడినై.

రూ. 266.43 కోట్ల రివిన్యూ ఖర్చును బడ్జెటు ప్రతిపాదిస్తోంది_ప్రణాళికకు చెందని కార్యక్రమాలకు రూ. 247.94 కోట్లు, రాష్ట్రప్రణాళికకు రూ. 11,58 కోట్లు, కేంద్రం ప్రతిపాదించే పథకాల క్రింద రూ 6,91 కోట్లు. 1969_70 సవరించిన అంచనాల్లోని రూ. 260. 33 కోట్లతో పోలిస్తే ప్రణాళికకు చెందని ఖర్చు పైకి తగ్గినట్టు కన్పిస్తుంది. దీనికి కారణం ముఖ్యంగా అనావృష్టి తుఫానుల విషయంలో ప్రజలకందిచ్చే సహాయాన్ని అంచనాల్లో చేర్చకపోవటం.

## పెట్టుబడి వ్యయం:

ప్రణాళికకు చెందిన, ప్రణాళికకు చెందని పథకాలపై పెట్టుబడివ్యయం 1970_71 లో రూ. 39.46 కోట్ల వరకూ వుండవచ్చు. ప్రణాళికకు చెందని కేటాయింపు_ పెట్టుబడికి చెందిన కొద్దిపాటి అంశాలు_ రూ. 3.96 కోట్లు_1969_70 సవరించిన అంచనాల ప్రకారం రూ. 3 31 కోట్లు, ప్రణాళికపై పెట్టుబడి వ్యయం రూ. 35.50 కోట్లు వుంటుంది. ప్రణాళిక వివిధ రంగాల్లో భారీ ప్రాజెక్టుల కేటాయింపు కూడా ఇందులో ఇమిడివుంది.

ఈ ఏడాది ప్రకటించే ఓపెన్ మార్కెట్ ఋణం ద్వారా వచ్చే వసూళ్లు రూ. 18 కోట్లు వుంటె, ఇక ఈ ఏడాది తిరిగి చెల్లించవలసిన ఋణా కింగాను రూ. 5.49 కోట్లు బడ్జెటులో చేర్చబడినై, చిన్నపొదుపు ఉద్యమం ద్వారా నికరంగా రూ. 3 కోట్లు లభించవచ్చునని అనుకుంటున్నాం ప్రభుత్వ ఉద్యోగులకు పెళ్లిళ్ల అడ్వాన్సులకింద బడ్జెటులో రూ. 6లక్షలు కేటాయించబడినై

## మొత్తంమీద పరిస్థితి:

ఈ చెప్పిన అంచనాల ప్రకారం, రివిన్యూ ఖాతా క్రింద రూ. 0.47 కోటి తరుగు వుంటుంది. పెట్టుబడి వ్యవహారాలు పబ్లిక్ ఋణం, పబ్లిక్ అక్కౌంట్–వీటన్నిటినీ లెక్కలోకి తీసుకుంటే, మొత్తంమీద రూ. 14.30 కోట్ల మిగులు వుంటుంది.

1970–71 సంవత్సరం రూ 14.43 కోట్ల తరుగు రొక్కపు నిల్వతో ప్రారంభం కావచ్చు. ఈ ఏడాది ఆర్థిక వ్యవహారాల మిగులు దృష్ట్యా, 1970–71 సంవత్సరం రూ 0.13 కోటి తరుగు రొక్కపు నిలవతో ముగియవచ్చు

ఇక బడ్జెట్‌లో అదనంగా చేసిన కొన్ని ముఖ్య కేటాయింపుల గురించి క్లుప్తంగా ప్రస్తావిస్తాను.

గాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంగా, హరిజన సంక్షేమంకోసం షెడ్యూల్డు జాతుల సంక్షేమంకోసం 1969–70లో ఒక కోటి రూపాయలు ప్రత్యేకంగా కేటాయించినట్లు గౌరవ సభ్యులకు తెలుసు. అభివృద్ధి వేగాన్ని కొనసాగించేందుకు కావలసిన కేటాయింపులు బడ్జెటులో చేయబడినై. షెడ్యూల్డు కులాలు, జాతులు, మిగతా వెనుకబడ వర్గాలకు ఇళ్ల స్థలాలను సమకూర్చేందుకై భూమి సేకరణకుగాను కేటాయింపు కోటి రూపాయలకు పెంచబడింది.

పోలీసు బలగాన్ని బలపరచటానికి రూ. 15 లక్షలు, పోలీసు వాహనాల మార్పిడికి, కొనుగోలుకు రూ. 15 లక్షలు 1969–70 బడ్జెటులో కేటాయించబడినై. 1970–71 లో ఇంకా కొంత అభివృద్ధిని చేకూర్చాలనివుంది. ఇందుకని బడ్జెట్ అంచనాల్లో రూ. 50 లక్షలు కేటాయించబడినై.

విద్యపై ఖర్చు ఏటేటా పెరుగుతోందనే సంగతి గౌరవ సభ్యులకు తెలుసు. 1970–71 బడ్జెటులో విద్యకుగాను రూ. 54.60 కోట్లు కేటాయించబడింది. 1969–70 సవరించిన అంచనాల కేటాయింపు రూ .52.95 కోట్లు. వైద్యవిద్య, షెడ్యూల్డు కులాల విద్య అలాగే షెడ్యూల్డు జాతుల, మిగతా వెనకబడ్డ వర్గాల విద్య–వీటి కేటాయింపులను కూడా లెక్కలోకి తీసుకుంటే, 1970–71లో విద్యపై మొత్తం ఖర్చు రూ. 60 కోట్లను మించివుండవచ్చును.

మురికిపేటల నిర్మూలానికిగాను ఆర్థిక సహాయాన్ని సమకూర్చేందుకై, మోటారుబండ్ల పన్నుల విషయంలో ఆదాయ నష్టం క్రింద పురపాలక సంఘాలకు ఇచ్చే నష్టపరిహారపు డబ్బును అధికం చేయాలని ప్రతిపాదించబడింది. ఇందుకై రూ. 26.21 లక్షలు బడ్జెట్‌లో కేటాయించబడినై. మురికిపేటల నిర్మూలానికి ఉద్దేశింపబడిన నిర్దిష్ట పథకాలకు ఈ మొత్తం మంజూరు చేయబడుతుంది.

రాష్ట్రపు వివిధ ప్రాంతాల్లో విస్తృతంగా జరిగిన నష్టం దృష్ట్యా సమగ్ర సహాయ పథకాన్ని చేపట్టటం శాసన సభ్యులకు తెలుసు. రూ. 34 కోట్ల కార్యక్రమాన్ని కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. ఇందుకు తగిన కేటాయింపు 1969–70 సవరించిన అంచనాల్లో చేయబడింది. ముసలితనపు పింఛన్ల క్రింద రూ. 115 లక్షలు కేటాయించ బడినై.

బడ్జెట్‌లో పన్నుల ప్రతిపాదనలు లేవు. అంతమాత్రాన మనం బేఫర్వాగా వుండటానికి వీలులేదు. నిజమే, ఆంధ్ర ప్రాంతంలో మద్యనిషేధ చట్టాన్ని రద్దుచేసినందువలన అదనపు ఆదాయం లభిస్తుంది. కాని మన అవసరాలూ పెరుగుతూనే వున్నాయి ఏదో కూపస్థ మండూకాల్లాగా వుండాలనివుంటేతప్ప, లేకపోతే, ప్రజలకిచ్చిన మాటలను నెరవేర్చేందుకుగాను కొత్త పన్నుల విధానాలను మనం అన్వేషించ వలసివుంటుంది.

అయిదవ ఆర్థిక సంఘం, వస్త్రాలు, పంచదార, పొగాకులపై అదనపు సుంకాన్ని విధించే పథకాలను తిరిగి పరిశీలించ వలసిందిగా సిఫార్సు చేసింది. జాతీయ అభివృద్ధి మండలి ఈ విషయం గురించి చర్చలు జరిపి, ఒక నిర్ణయానికి రావలసివున్నది. రాజ్యాంగంలోని 269 సూత్రంలో నిర్దేశించిన పన్నుల గురించి కూడా పరిశోధించవలసిందిగా సూచించబడింది. ఈ పన్నుల విషయంలో తీసుకొనే నిర్ణయాల ఫలితంగా రాష్ట్రంలో వనరుల పరిస్థితి మెరుగుకావచ్చునని అనుకుంటున్నాం.

కేంద్ర ఋణ సహాయంతో ప్రారంభించిన భారీ అభివృద్ధి కార్యక్రమాల విషయమై పెరిగిపోతున్న మన అప్పుల తిరిగి చెల్లింపులో కొన్ని సర్దుబాట్లను చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరాం. మన కోరికలకు కేంద్ర ప్రభుత్వం ఒప్పుకుంటుందనే నమ్ముతున్నాం. అయితే, కచ్చితంగా ఆర్థిక నియమాన్ని మనం పాటించాలని, ఖర్చులో కచ్చితంగా పొదుపును సాధించేట్టు చూడాలని మళ్లీ ఉద్ఘాటిస్తున్నాను. ఆర్థిక స్థిరత్వాన్ని, రాష్ట్రంలో సర్వతోముఖ అభివృద్ధిని సాధించటం ఈ ఏడాది మన కర్తవ్యంగా వుండాలి.

## ఆర్థిక ధోరణులు:

అంతకుముందు, ఆర్థిక ధోరణులను సమీక్షిస్తూ, ఆర్థిక మంత్రి యిలా అన్నారు:

ఇటీవల కొన్నినెలలుగా ప్రకృతి మనపట్ల ఇదివరకెప్పుడూ లేని నిర్దాక్ష్యాన్ని చూపుతూ వస్తోంది. ఇది గౌరవ సభ్యులకూ తెలుసు. వాతావరణ పరిస్థితులు ప్రతికూలంగా వుండటం పరిపాటైపోయింది. కోస్తా జిల్లాలపై తుఫానులు నిర్విరామంగా దాడిచేయటం, తుఫానుల తర్వాత అదేపనిగా కుంభవృష్టి –వీటన్నిటి ఫలితంగా వ్యవసాయ రంగపు ఆర్థిక వ్యవస్థ బాగా దెబ్బతిన్నది. 1964–65లో 75.82 లక్షల టన్నులు ఉన్న ఆహారధాన్యాల ఉత్పత్తి 1965–66 నాటికి 60 01 లక్షల టన్నులకు తగిపోయింది. అయితే 1966–67లో 68.23 లక్షల టన్నులకు, 1967–68లో 70.79 లక్షల టన్నులకూ పెరిగింది. కాని 1968–69లో ఉత్పత్తి మళ్లీ తగ్గింది. 65.68 లక్షల టన్నుల ఆహారధాన్యాలు మాత్రమే పండినై.

తుఫానులు, వానల మూలంగా ఈ ఏడాది జరిగిన నష్టం ఫలితంగా, మొత్తం రాష్ట్ర ఆర్థిక దృశ్యం ప్రోత్సాహకరంగా వుండేట్టు లేదు. మనది ప్రధానంగా గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కాబట్టి వ్యవసాయ రంగంలోని ఉత్పత్తులోని ఒడుదుడుకులపైన ఆధారపడివుంటుంది_మొత్తం ఆర్థిక పరిస్థితి. ఇక వ్యవసాయ రంగపు అకాశంలోని నల్లమబ్బుల ఫలితంగా, మన ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొనే ఉరుము మెరుపులను మనం ఊహించవచ్చు.

## తెలంగాణా మిగుళ్లు :

తెలంగాణా మిగులు నిధులను గురించి ప్రస్తావించి ఆర్థిక మంత్రి యిలా అన్నారు :

'తెలంగాణా అభివృద్ధికోసం ప్రభుత్వం ఎంత దీక్షతో, నిశ్చయంతో కృషిచేస్తోందో సభ్యులకు పూర్తిగా తెలుసు. ఈ బడ్జెట్ సమర్పింపబడే సమయానికి, భార్గవ సంఘపు నివేదిక లభ్యం కాగలదని ఆశించాం. కాని ఈ నివేదికను కేంద్ర ప్రభుత్వం ఇంకా ప్రచురించవలసి వుంది. ఆ తర్వాత, తెలంగాణా ప్రత్యేక కేటాయింపుల విషయాన్ని సుస్పష్టంగా అంకెల్లో వివరించటానికి వీలవుతుంది."

## రాయలసీమ ప్రణాళిక, అభివృద్ధి సంస్థ :

"రాయలసీమకై ఒక ప్రణాళిక, అభివృద్ధి సంస్థను ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఈ సంస్థలో పార్లమెంటు సభ్యులు, రాష్ట్ర శాసన సభ్యులు, జిల్లా కలెక్టర్లు, జిల్లా పరిషత్తుల అధ్యక్షులు, తదితరులు సభ్యులుగా వుంటారు. క్షామాన్ని నిర్మూలించి, ఆ ప్రాంతంలో అభివృద్ధిని వేగిరపరచటానికి కావలసిన కార్యక్రమాలను ఈ సంస్థ నిర్వహిస్తుంది. సంస్థ ఆలోచనలు ప్రారంభించి, ఉప సంఘాలు వివిధ జిల్లాల్లో పర్యటించినై. ఎంతో కాలంగా క్షామ పీడితంగా వున్న రాయలసీమ సత్వర అభివృద్ధికి ఈ సంస్థ ఏర్పాటు దోహదపడగలదు."

## గిరిజన సంక్షేమం :

"గిరిజన సంక్షేమానికై సమగ్ర పథకాన్ని అమలుచేయాలని ప్రతిపాదించబడింది_నాల్గవ ప్రణాళికలోని మిగతా గడువుకు రూ. 10 కోట్లు ప్రత్యేకంగా కేటాయించబడినై. వ్యవసాయం చిన్న నీటిపారుదల, పరపతి సౌకర్యాలు, రవాణా అభివృద్ధి వగైరా కార్యక్రమాలు ఈ పథకంలో చేర్చబడుతై. రాష్ట్రంలోని షెడ్యూల్డు ప్రాంతాల్లో ఇంకా వ్యాప్తిలోవున్న మధ్యవర్తి కౌలు విధానాలను రద్దుచేసేందుకై ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ మహల్స్ (రద్దు, రైత్వారీలోకి మార్పు) నిబంధన 1969 ని, ఆంధ్రప్రదేశ్ ముట్టాస్ (రద్దు, రైత్వారీలోకి మార్పు) నిబంధనలు 1969 ని జారీచేసింది. గిరిజనేతరులకు భూమిని బదిలీచేసే విషయమై ఇంకా కొన్ని నిబంధనలు నిర్దేశింపబడినై. గిరిజనుల అప్పులను తగ్గిస్తూ, ఈ అప్పుల విషయంలో మారటోరియమును ప్రవేశపెట్టూ, ఒక నిబంధన త్వరలో అమలులోకి వస్తుంది. రాష్ట్రంలోని షెడ్యూల్డు ప్రాంతాలన్నిటిలో గిరిజనేతరులకు ప్రభుత్వ భూముల కేటాయింపును నిషేధిస్తూ, ప్రభుత్వం ఇదివరకే ఉత్తర్వులను జారీచేసింది. ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు జాతుల కార్పొరేషన్‌ను బలపరచటానికి, వ్యాపార బ్యాంకుల నుంచి గిరిజనులకు తగిన పరపతి సౌకర్యాలు సమకూర్చటానికి తగు ఏర్పాటు జరగాలని ప్రతిపాదించబడింది."

---

## రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు కోరబడుచున్నవి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ, ఫొటోలకూ పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధ యాత్రిక శాఖ, హైదరాబాదు.

---

# అగ్నిగుండాల రాగి, సీసం గనులకు ప్రారంభోత్సవం



అగ్నిగుండాల ప్రాజెక్టు ప్రాంతం



కేంద్రప్రభుత్వ గనుల శాఖ మంత్రి శ్రీ ఆర్. జగన్నాధరావు ప్రసంగిస్తున్న దృశ్యం

కేంద్ర ప్రభుత్వ గనుల శాఖామంత్రి శ్రీ ఆర్. జగన్నాధ రావు, ఫిబ్రవరి 4 వ తేదీ సాయంత్రం, గుంటూరుజిల్లా బొల్లాపల్లో అగ్నిగుండాల రాగి సీసం గనులకు బండమెట్ట ప్రారంభోత్సవం చేస్తూ ఈ ప్రాజెక్టు నిమిత్తం రు. 5,86 కోట్లు మంజూరు చేశారని అన్నారు. ప్రస్తుతం దేశంలో నాన్‌ఫెర్రస్ లోహాలు కొరతగా ఉన్నాయని, ప్రతి సంవత్సరం వాటికై దాదాపు రు. 55_60 కోట్లు ఖర్చుచేస్తున్నామనీ ఆయన అన్నారు. "వ్యవసాయ విప్లవం" మాదిరిగా "ఖనిజాల విప్లవం" ద్వారా దేశ ఆర్థిక ప్రగతిని సాధించవచ్చునని ఆయన అభిప్రాయ పడినారు. నాలుగవ ప్రణాళికాంతం వరకు యీ ఖనిజాలకు సంబంధించి 50 శాతం వరకు అవసరాలను తీర్చవచ్చునని ఆయన ఆశించారు. అల్యూమినియం విషయంలో దేశం స్వయం సమృద్ధమైనదని ఆయన అన్నారు. ప్రాజెక్టులో 3, 4 తరగతుల ఉద్యోగాల విషయంలో స్థానిక వ్యక్తులను నియమించడం జరుగుతుందని శ్రీ జగన్నాధరావు చెప్పారు. ఇతర పదవులకు యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ద్వారా నియామకాలు జరుగుతాయి. రాష్ట్ర ప్రభుత్వం కొంతమంది అధికారులను పంపగలిగినట్లయితే నేను చాలా సంతోషంగా వారిని పదవులలోకి తీసుకొంటాను. ఇక్కడ ఖనిజాలు సమృద్ధిగా లభ్యమయ్యేట్లయితే కార్పొరేషన్‌ను నియమించవచ్చని ఆయన అన్నారు.

ఈ సభకు ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు. ఆయన ఈ సందర్భంలో మాట్లాడుతూ తుత్తునాగం, రాగి వంటి నాన్‌ఫెర్రస్ లోహాలను దిగుమతి చేసుకోవడం ఆర్థికంగా లాభసాటికాదు. ఈ ప్రాంతంలో ఈ ఖనిజాలు సమృద్ధిగా లభ్యమవుతాయి. ఇక్కడ డ్రిల్లింగు చేయగా పొరుగు ప్రాంతాలలో కూడా ఇవి నిక్షిప్తమైవున్నట్లు తెలిసిందని అన్నారు.

ఇక్కడ ఎన్ని అసౌకర్యాలు వున్నా అధికారులు కార్య దీక్షతో పనిచేస్తున్నందుకు వారికి ముఖ్యమంత్రి తమ కృతజ్ఞత తెలిపారు. ఈ అధికారులు దేశంలో దూరదూర ప్రాంతాలనుంచి వచ్చి ఇక్కడ పనిచేస్తున్నారు. ముఖ్యమంత్రి తమ ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ, వినుకొండ తాలూకా రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతంగా వున్నదని అన్నారు. నాగార్జునసాగరు, రాగి_సీసం

వంటి ప్రాజెక్టుల ఫలితంగా ప్రజల సుఖతర జీవనం కొరకు ఈ పరిశ్రమాన్ని అభివృద్ధిపరచవచ్చని ఆయన చెప్పారు.

వాణిజ్యం, ఎగుమతి ప్రోత్సాహం, ఖనిజ శాఖల మంత్రి శ్రీ ఎ. ప్రసాదరావు వందన సమర్పణ చేశారు. అంతకుముందు వేదపఠనాల మధ్య టేపును కత్తిరించి శ్రీ జగన్నాధరావు ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేశారు.

## పూర్వరంగం

భారత భూగర్భ సర్వే సంస్థవారు రాగి, సీసం, తుతునాగం ఖనిజాలకు సంబంధించి రాష్ట్రంలో యింతవరకు జరిపిన అనేక పరిశోధనలలో అగ్నిగుండాల ఖనిజ నిక్షేపాల పరిశోధన లాభసాటి అయినది. తత్ఫలితంగా యీ ప్రాంతంలో గనుల అభివృద్ధి పనిని హిందుస్థాన్ కాపర్ సంస్థకు అప్పగించబడింది. బండ్లమెట్టలో సీసం నిధుల త్రవ్వకం ప్రారంభించడం ద్వారా వారి ప్రథమ దశ కార్యక్రమం ప్రారంభమయింది.

గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా, అగ్నిగుండాల సమీపంలో ప్రాతకాలంనాటి త్రవ్వకం పనులు, యితర పురాతన లోహపరిశోధనల సాక్ష్యాధారాల ద్వారా సీసం, రాగి నిధులను కనుగొన్నారు. భారత భూగర్భ పరిశోధన సంస్థవారు 1949 లో ప్రప్రథమంగా యిక్కడ పరిశోధనలు ప్రారంభించారు. 1952–1956 వరకు యీ పరిశోధనలను కొనసాగించారు. దేశవాళీ బేస్ మెటల్ వనరుల నిమిత్తం దేశమంతా విస్తృత ప్రాతిపదికపై తీవ్రతరంగా పరిశోధనలు జరిపే కార్యక్రమాన్ని అమలు జరుపుతున్న తరుణంలో 1959 లో భారత భూగర్భ సర్వే సంస్థకు చెందిన బేస్ మెటల్ యూనిటువారు యిక్కడ క్రమపద్ధతిలో పరిశోధన జరిపే పనిని తిరిగి ప్రారంభించారు. ఈ ప్రాంతంలో కూలంకషంగా పరిశోధనలు జరపడానికి అవకాశాలు ఉన్నాయని 1958–59 లో జరిపిన ప్రాథమిక పరిశీలనల ద్వారా స్పష్టమైంది.

1959–61 లో విస్తృత ప్రాతిపదికపై జరిపిన పరిశోధనల ఫలితంగా 1. బండ్లమెట్ట సీసం – రాగి నిధులు, 2. నల్లకొండ రాగి నిధులు, 3. ధూకొండ రాగి–సీసం నిధులు కనుగొనబడినాయి. ఈ ప్రోత్సాహకరమైన ఫలితాలను అనుసరించి యిక్కడ ఎంత విస్తీర్ణంలో యేపరిమాణంలో ఎటువంటి రకం లోహాలు ఉన్నాయో కనుగొనడానికి పైన తెల్పిన మూడు బ్లాకులలో త్రవ్వకం పనులను ప్రారంభించారు.

## అగ్నిగుండాల రాగి-సీసం పథకం

గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా అగ్నిగుండాల ప్రాంతములో అనాది కాలంనుండీ రాగి, సీసం దొరికిన చిహ్నాలు కనిపించిన కారణంగా కేంద్ర భూగర్భ పరిశోధక సంస్థవారు 1958 నవంబరు నుండి అక్కడ పరిశోధనలు ప్రారంభించారు. ధూకొండ, నల్లకొండ, బండ్లమెట్ట బ్లాకులలో విస్తృత ప్రాతిపదికపై భూరసాయనిక, భూభౌతిక పరిశోధనలు జరిపిన కారణంగా లభించిన ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. అందుకుతోడు 1959–61లో పురాతనకాలపు పనులను గూర్చి కూడా పరిశోధనలు జరిపారు. అవి కూడా ప్రోత్సాహకరమైన ఫలితాలను యిచ్చాయి. భారత భూగర్భ సర్వే సంస్థవారు డ్రిల్లింగ్ కార్యక్రమాన్ని చేపట్టాలని నిర్ణయించారు

## మూడు రకాల నిక్షేపాలు

మూడు బ్లాకులలో దాదాపు 50,000 మీటర్ల లోతు డ్రిల్లింగ్ చేశారు. 1. బండ్లమెట్ట సీసం మరియు రాగి నిధులు, 2 నల్లకొండ రాగి నిధులు, 3 ధూకొండ రాగి మరియు సీసం నిధులు కనుగొనబడినాయి.

## ముడి ఖనిజాలు

బండ్లమెట్ట ప్రాంతం, ధూకొండ ప్రాంతంలో కొన్ని భాగాలలోని కొండ చెరియలలో మాగ్నీష సున్నపురాయి లభించింది. బండ్లమెట్ట నిధులలో ఎక్కువ భాగం ముడి సీసం, ముడి రాగి ఉంది.

నల్లకొండ, ధూకొండ ప్రాంతాలలో ఒక రకం స్ఫటికం, మాగ్నీష సున్నపురాయి, ముడి రాగి, ముడిసీసం నిధులు ఉన్నాయి.

బండ్లమెట్ట, నల్లకొండ, ధూకొండ ప్రాంతాలలో లభించిన ఖనిజాల మచ్చు తునకలను పరిశోధించగా వాటిలో వెండి (22.72 పిపిఎం), మణిశిల (0.072–1.14 శాతం), పాషాణం (0 043–0 60 శాతం), నికెల్ (0 02–0.20 శాతం) అంశాలు ఉన్నాయి. భారత భూగర్భ సర్వే సంస్థ అందజేసిన వివరాల ఆధారంగా యీ ప్రాంతంలో గనుల త్రవ్వకం పనులను హిందుస్థాన్ కాపర్ లిమిటెడ్ (కేంద్ర ప్రభుత్వ సంస్థ) వారు చేపట్టాలని నిర్ణయించారు. ఈ పని నిమిత్తం విదేశ సంస్థ సహాయాన్ని పొందాలని కూడా ఒక సమయంలో అనుకున్నారు. అయితే దానివల్ల జాప్యం జరుగుతుందనే దృష్టితో ఎవరి సహాయం లేకుండానే యీ పనిని చేపట్టాలని నిర్ణయించారు.

ప్రారంభంలో బండ్లమెట్ట ప్రాంతంలో సీసం–రాగి నిధులను వెలికి తీయాలని నిర్ణయించి, 1968లో ఒక నివేదికను ప్రత్యేక సాంకేతిక నిపుణుల సంఘానికి సమర్పించారు. గని త్రవ్వకం ప్రారంభించి లోహపరిశోధన నిమిత్తం అధిక మొత్తంతో సమూనాలను సేకరించడమేగాక దానితోపాటు కర్మాగారం, కరిగించే బట్టీల పరిమాణం గూర్చిన సమాచారాన్ని కూడా అందజేయాలని నిర్ణయించారు.

అగ్నిగుండాలకు 30 మైళ్ళ పరిసర ప్రాంతాలలో కూడా ఖనిజాలు లభించే అవకాశాలు ఉన్నాయని యిటీవల పరిశోధనల ద్వారా వెల్లడి అయింది. వాటి విషయంలో మరింత విస్తృత ప్రాతిపదికపై పరిశోధనలు జరపాలని నిర్ణయించారు. 

# మన ప్రాజెక్టులు - ఇంజనీరింగ్ ప్రతిభ





**కాసు బ్రహ్మానందరెడ్డి**

అపారమైన ప్రకృతి వనరులూ, సుస్థిరతా కలిగిన విశాలరాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ అవతరించడం, స్వాతంత్ర్యానంతరం సంభవించిన గణనీయమైన సంఘటనలలో ఒకటి.

తెలుగుభాష మాట్లాడే నాలుగు కోట్ల మంది ప్రజలకు గొప్ప చరిత్ర, సంస్కృతి, సంప్రదాయం వున్నాయి. గతంలో వారు వివిధ రంగాలలో ఎంతో అభివృద్ధి సాధించారు. ఒకే పరిపాలనా వ్యవస్థక్రింద వారు తిరిగి ఏకంకావడంవల్ల మళ్లీ ఉన్నత స్థితికి చేరుకోవడానికీ, రాష్ట్రాన్నీ, రాష్ట్రప్రజలనూ సర్వతోముఖంగా అభివృద్ధి పరచడానికీ వారికి అవకాశం కలిగింది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుంచీ రాష్ట్రం, సామాన్య వ్యక్తికి ప్రయోజనం చేకూర్చే అనేక అభివృద్ధి పథకాలను అమలు పరచడానికై పాటుపడుతున్నది. స్థాపిత విద్యుదుత్పత్తిశక్తి మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో 99 మె.వా. మాత్రమే వుండగా అది 580.4 మె.వా.కు పెరిగింది. ఇదేవిధంగా నీటిపారుదల జరుగుతున్న మొత్తం భూమి విస్తీర్ణం 62.36 లక్షల ఎకరాల నుంచి 98.14 లక్షల ఎకరాలకూ, విద్యుచ్ఛక్తి సరఫరా జరిగిన గ్రామాల సంఖ్య 146 నుంచి సుమారు 5,000లకూ హెచ్చింది. శ్రీ ఎస్.వి. రామమూర్తివంటి పరిపాలనా దక్షులూ, సర్ ఆర్థర్



నిజాం సాగర్ ప్రాజెక్టు

కాటన్, సర్ ఎం. విశ్వేశ్వరయ్య, నవాబు అలీ నవాజ్ జంగ్ వంటి ప్రముఖ యింజనీర్లు, ఇంజనీరింగ్ రంగంలో ఈ రాష్ట్రం అభివృద్ధికి చేసిన సేవలు గణనీయమైనవి.

గడచిన పదమూడు సంవత్సరాలలో ఈ రాష్ట్రం అన్ని రంగాలలోనూ సత్వర అభివృద్ధిని సాధించడం ముదావహం. మూడు పంచవర్ష ప్రణాళికలలో 16 భారీ ప్రాజెక్టులు. 45 మధ్యరకం ప్రాజెక్టులు చేపట్టబడినవి. భారీ, మధ్యరకం నీటిపారుదల ప్రాజెక్టులకు రెండవ పంచవర్ష ప్రణాళికలో రూ. 57 43 కోట్లు, మూడవ పంచవర్ష ప్రణాళికలో రూ. 79.62 కోట్లు కేటాయించారు.

## నదుల రాష్ట్రం

కృష్ణా, గోదావరి, పెన్నా, నాగావళి. వంశధార నదీలోయలలో ఆంధ్రప్రదేశ్ కడపటి రాష్ట్రం భౌగోళికమైన అనుకూల పరిస్థితివల్ల ఈ రాష్ట్రానికి, పై నదీ ప్రాంతాలలో విశాలమైన మైదానాలు, సారవంతమైన డెల్టాలు అమరినవి. రాష్ట్రంలో యింకా అనేక యితర పెద్దనదులూ, చిన్ననదులూ వున్నాయి. వీటివల్ల యితోధికంగా నీటివసరులు చేకూరుతున్నాయి.

కృష్ణా. గోదావరి. పెన్నా డెల్టాలలో సుమారు 28 లక్షల ఎకరాలకు నీటిపారుదల జరుగుతుంది. విజయవాడ వద్దగల పాత ఆనకట్ట ఒక శతాబ్దంపాటు అమోఘమైన సేవచేసిన అనంతరం 1953వ సంవత్సరంలో వరదల మూలంగా దెబ్బతిన్నది. 1954_58 లో ఈ ఆనకట్టకు బదులు కృష్ణా బ్యారేజిని నిర్మించారు. సుమారు వంద సంవత్సరాల క్రితం నిర్మించబడిన 200 మైళ్ల పొడవుగల కర్నూలు_కడప కాలువ ఈ రంగంలో ప్రతిభావంతమైన పనితనానికి నిదర్శనం. కృష్ణానది జలాలను రాయలసీమకు కొనిపోవడానికి సర్ ఆర్ధర్ కాటన్ దీనిని రూపొందించారు. రాయలసీమలో వర్షపాతం తక్కువ. ఇక్కడ మామూలుగా 21 అంగుళాల వర్షం మాత్రమే కురుస్తుంది. 1900వ సంవత్సరం లగాయతు 1960వ సంవత్సరం వరకు గడచిన 60 సంవత్సరాల కాలంలో సగటున ప్రతి అయిదు సంవత్సరాలకూ ఒక పర్యాయం రాయలసీమలో ఏదో ఒక ప్రాంతం తీవ్ర దుర్భిక్షానికి గురైంది. కాబట్టి రాయలసీమలో ఎక్కువగా నీటిపారుదల సౌకర్యాలు కల్పించడం తప్పనిసరి. రాష్ట్రంలోని, దేశంలోని ఇంజనీర్లకు యిది ఒక సవాలు. ఆంధ్రప్రదేశ్ లో కృష్ణానది క్రింద సులభంగా నీటిపారుదల జరుగగల విశాలమైన భూములలో నీటికి ఎద్దడి వుండగా, విద్యుచ్ఛక్తి వుత్పత్తి కొరకు అమూల్యమైన కృష్ణానది జలాలను అరేబియా సముద్రం పాలుచేసి వృధాచేయడం సబబుకాదని నా అభిప్రాయం.

5,000 అడుగుల ఎత్తుగల సహ్యాద్రి పర్వతాలతో పోల్చినప్పుడు కృష్ణా, పెన్నా జల ప్రవాహాలను విభజించే గట్టు తక్కువ ఎత్తులో వున్నది. కాబట్టి పెన్నా బేసిన్‌ను కృష్ణా ఉపబేసిన్‌గా పరిగణించాలి. రాయలసీమలోనూ నెల్లూరు మెట్ట ప్రాంతాలలోనూ గల విస్తృతమైన బీడు భూములకు నీటి పారుదల చేసే నిమిత్తం పెన్నానదికి కృష్ణానది జలాలను అందించడం కొరకు సర్ ఆర్ధర్ కాటన్, 1860 వ సంవత్స

రంలోనే తుంగభద్ర బహుళార్థ సాధక ప్రాజెక్టును కూడా రూపొందించారు. అయితే ఈ ప్రాజెక్టును 1952 నాటికి పూర్తి చేయడంజరిగింది. ప్రస్తుతం ఈప్రాజెక్టు కుడికాలువ క్రిందకర్నూలు జిల్లాలో దాదాపు 1.57 లక్షల ఎకరాలకు నీటిపారుదల జరుగుతుంది.

## రామసాగరం సొరంగం

కాలువ మొదటి ఆరుమైళ్ళలోవున్న రామసాగరం సొరంగమూ, 75 వ మైలు వద్ద హగరి మీదవున్న అక్వెడక్టూ, చూచే వారిని ఆకర్షిస్తాయి. క్లిష్టమైన పనితనానికి యివి మచ్చులు. అక్వెడక్టు 2,828 అడుగుల పొడవున వుంది. దక్షిణాదిలో యింత పెద్ద అక్వెడక్టు మరొకటి లేదు. తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ మొదటి దశ, 1967 లో ప్రారంభించ బడింది ఇందువల్ల అనంతపురం జిల్లాలో అదనంగా మరో 1.2 లక్షల ఎకరాలకు నీటి పారుదల జరుగుతుంది. పులి వెందుల కాలువతో సహా కడపటి దశ ముగిసే నాటికి దీని ద్వారా అనంతపురం, చిత్తూరు జిల్లాలో మరో 1.3 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు లభిస్తాయి.

కృష్ణానది లోయకు చెందిన ప్రాజెక్టులలో తుంగభద్ర తరువాత రెండవది నాగార్జున సాగర్, మూడవది శ్రీశైలం ఆనకట్ట. ఇది నాగార్జునసాగర్ ఆనకట్టకు ఎగువన 65 కి. మీ. ల దూరంలో వుంది. భీమ, ఎగువ కృష్ణా, పులిచింతల ప్రాజెక్టులు యింకా ఏర్పడవలసివుంది. ఇది జరిగినప్పుడేకాని యావద్భారత దేశం ప్రయోజనార్థం ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది నీటి వనరులను పరిపూర్ణంగా, దీర్ఘకాలికంగా అభివృద్ధి పరచడం పూర్తి కాదు.

## ఇంజనీరింగ్ నైపుణ్యం:

స్వర్గీయ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, 1955 డిశంబరులో "మానవతా మందిరమైన" నాగార్జునసాగర్ ఆనకట్టకు శంకుస్థాపన చేయడంతో ఆంధ్రుల చరిత్రలో నూతన అభ్యుదయ శకానికి నాంది, జరిగింది ఈ ప్రాజెక్టు వల్ల నల్గొండ, ఖమ్మం, కృష్ణా, గుంటూరు, కర్నూలు, నెల్లూరు జిల్లాలలో 20.54 లక్షల ఎకరాలకు నీటిపారుదల జరుగుతుంది. దీనిద్వారా తుది ఘట్టంలో 32 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యాలు లభిస్తాయి. ఈ ప్రాజెక్టు కృష్ణా డెల్టాకు 12 లక్షల ఎకరాల మేరకు మొదటి పంట ఆయకట్టును స్థిరీకరిస్తుంది. కాలువల పని నూటికి 60 పాళ్ళు పూర్తయింది. కుడి, ఎడమ కాలువలకు ప్రథమ దశలో త్రవ్విన సొరంగాలు మన ఇంజనీర ఇంజనీరింగ్ నైపుణ్యాన్ని చక్కగా చాటుతున్నాయి.

కాలువలు, ఉపకాలువలు క్లిష్టమైన, అద్భుతమైన పనితనం ప్రదర్శితమయ్యే నిర్మాణాలతో కూడుకొని వేల మైళ్ళ పొడవున వుంటాయి. మొదటి దశలో లాల్‌బహదూర్ (ఎడమ) కాలువ, జవహర్ (కుడి) కాలువల నీటి వాహక శక్తి 11,000 క్యూసెక్కులు వుంటుంది.

కడపటి దశలో కుడి కాలువ నీటి వాహక శక్తి 21,000 క్యూసెక్కులు, ఎడమ కాలువ నీటి వాహక శక్తి 15,000 క్యూసెక్కుల చొప్పున ఉంటుంది, 1966 లో, కాలువలను ప్రారంభించిన మూడవ సంవత్సరంలో ప్రాజెక్టు పని పూర్తికాకపూర్వమే ఆయకట్టు అభివృద్ధి 8 లక్షల ఎకరాల మేరకు జరిగింది. నీటి పారుదల; డ్రైనేజి విషయాల అంతర్జాతీయ సంస్థ 1969 సంవత్సరంలో మెక్సికోలో ఏర్పాటు చేసిన సభకు హాజరైన మన ఇంజనీరు ఒకరు మనం సాధించిన సత్వర ఫలితాలనుగురించి చెప్పినప్పుడు ఆ అంశం దేశదేశాల ఇంజనీర్ల దృష్టిని ఎంతగానో ఆకర్షించింది. మన ఇంజనీరు, నాగార్జునసాగర్ వద్ద "పంపింగ్ ద్వారా నిలువచేసే జల విద్యుత్ పథకాన్ని" రూపొందించారు. మన దేశంలో ఇటువంటి పద్ధతిని అవలంబించడం ఇదే ప్రథమం.

శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు "శైశవ" దశను అధిగమించింది. ఈ ప్రాజెక్టుకు స్వర్గీయ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 1963 జూలై 24 వ తేదీన శంకు స్థాపన చేశారు.

కృష్ణానది ప్రవాహమార్గంలో 470 అడుగుల ఎత్తున నిర్మించబడే ఈ ప్రాజెక్టు అపూర్వమైన నిర్మాణంగా అలరారుతుంది. విద్యుత్ కేంద్రపు స్థాపిత విద్యుదుత్పత్తి శక్తి 780 మె. వా. లు వుంటుంది. నది మళ్లింపు, కాఫర్‌డాముల నిర్మాణం, నీటి తోడివేత వంటి జటిల సమస్యలను మన ఇంజనీర్లు విజయవంతంగా పరిష్కరించారు. కాఫర్ డాములలోని చిన్న బెజ్జాన్ని కనుగొనడానికి మొదటి సారిగా యిచ్చట ఐసోటోపులను ప్రవేశపెట్టారు. తరువాత



విజయవాడ వద్ద ప్రకాశం బ్యారేజి



తుంగభద్ర దిగువ కాలువ పథకం: అక్విడెక్టు

దీనిని సులభంగానే పూడ్చివేయడం జరిగింది. కాఫర్ డాములలో మొత్తం 10,12,000 ఘనపుటడుగుల కాంక్రీటు ఉపయోగించబడింది. ఈ ఆనకట్ట నిర్మాణం బహుశః 1974 నాటికి పూర్తవుతుంది.

## గోదావరి జలాలు

గోదావరి కృష్ణానదికంటే పెద్దది. ఇది రాజమండ్రి నుంచి వైభవోపేతంగా ప్రవహిస్తుంది. ఈ నది ఆంధ్రుల జీవిత వికాసానికీ, అభ్యున్నతికీ చిహ్నం. 1865 వ సంవత్సరంలో ధవళేశ్వరం వద్ద సర్ ఆర్థర్ కాటన్ నిర్మించిన ఆనకట్టా, ప్రస్తుతం నిర్మించబడుతున్న పోచంపాడు ప్రాజెక్టు మినహా ఆంధ్రప్రదేశ్‌లో గోదావరి నదిమీద యితర భారీ ప్రాజెక్టు లేవీ లేవు. ముఖ్యంగా ప్రముఖ ఇంజనీరు శ్రీ అలీ నవాజ్‌జంగ్ శ్రద్ధ వహించిన ఫలితంగా వెనుకబడిన తెలంగాణా జిల్లాలైన నిజామాబాదు, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ, ఆదిలాబాదులలో దాదాపు 21.3 లక్షల ఎకరాలకు నీటిపారుదల చేసే నిమిత్తం 280 శ. కో. ఘ. అ. ల గోదావరీ జలాలను వినియోగించుకోవడానికి పథకం రూపొందించబడింది. 120 అడుగుల ఎత్తున నిర్మించదలచిన పోచంపాడు ఆనకట్ట పనికి స్వర్గీయ ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 1963 జూలైలో ప్రారంభోత్సవం చేశారు. దానితో ఆంధ్రప్రదేశ్ చరిత్రలో నూతన శకారంభం జరిగింది. ఆనకట్ట భాగంలో రాతిపని 60 అడుగుల ఎత్తు వరకు పూర్తయింది. అయిదు మైళ్ళ పొడవున మట్టి ఆనకట్ట నిర్మించేపని 50 శాతం ముగిసింది. ఇచ్చట నిర్మించబడుతున్న ప్రస్తుతం నిర్మాణంలో నున్న "స్లాటెడ్ రోలర్ బకెట్" ప్రత్యేకత కలిగినట్టిది. మన దేశంలో యిటువంటి వాటిలో యిది మొదటిది. 1970 జూన్ నాటికి కనీసం 40,000 ఎకరాల విస్తీర్ణానికి నీటి పారుదల జరుగవచ్చునని ఆశించబడుతున్నది. ఈ ప్రాజెక్టు గోదావరి డెల్టాలో మొదటి పంటకు సంబంధించిన 13 లక్షల ఎకరాలను స్థిరీకరిస్తుంది. గోదావరి నది ఎగువ భాగంలో పోచంపాడు ప్రాజెక్టును, దిగువ భాగంలో ధవళేశ్వరం ఆనకట్టను కలిగివున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వీటి మధ్య భాగంలో అపారమైన ఈ నదీ జల వనరులను యితోధికంగా వినియోగంలోనికి తేవడానికి ప్రయత్నం సాగిస్తున్నది. సుహృద్భావ సంబంధాల ద్వారానూ, అంతర రాష్ట్ర సహకారం ద్వారానూ ప్రాణహిత, ఇంఛంపల్లి, ఇప్పూరు ప్రాజెక్టులు, పోలవరం బ్యారేజి వంటి పథకాల విషయంలో దర్యాప్తులు జరిపి బ్లూ ప్రింటులను సిద్ధంచేయడం జరిగింది. ధవళేశ్వరం వద్ద ఆనకట్ట స్థానే బ్యారేజి నిర్మిస్తారు. ఈ పనులు త్వరలో ప్రారంభించ బడతాయి. పోలవరం బ్యారేజి నుంచి బయలుదేరే ఎడమ కాలువ విశాఖపట్నం వరకూ వెళ్ళి అచ్చట నిర్మించబడుతున్న పారిశ్రామిక సంస్థలకు నీటిని సరఫరా చేస్తుంది.

## వంశధార ప్రాజెక్టు

సహకార కృషితో నిర్మించబడుతున్న మరో పథకం వంశధార ప్రాజెక్టు. ఒరిస్సా రాష్ట్రంతో కలిసి దీనిని నిర్మిస్తున్నారు.

ఈ ప్రాజెక్టు క్రింద సింగిడివద్ద ఒక బ్యారేజి, గొట్ట, హీర మండలంలో రిజర్వాయరు నిర్మించబడతాయి. 1962 సంవత్సరంలో ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలకు మధ్య ఒప్పందం జరిగింది. నేరడి బ్యారేజి పని సాగుతున్నది. నేరడి కాలువలు సుమారు 40,000 ఎకరాలకు నీటి పారుదల చేయగలుగుతాయి. రెండు వైపులా గొట్ట కాలువలు మరో 2.5 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని అందిస్తాయి. పెన్నానదిపై సోమశిలవద్ద నాలుగవ ప్రణాళికా కాలంలో మరో భారీ ప్రాజెక్టును నిర్మించదలచారు. దీనివల్ల నెలూరుజిల్లాలో సుమారు 3.7 లక్షల ఎకరాలకు నీటి పారుదల జరుగ గలుగుతుంది.

వ్యవసాయ రంగంలో త్వరితంగా అభివృద్ధి సాధించడానికి పైన క్లుప్తంగా వివరించబడిన భారీ ప్రాజెక్టులే కాకుండా రాజోలిబండ మళ్లింపు పథకం (1956), భైరవానితిప్ప ప్రాజెక్టు (1950), కడం (1958) సరళాసాగర్, మూసి, (1957_58) ప్రాజెక్టులవంటి పెక్కు పథకాలు సైతం తోడ్పడాయి. ఈ పథకాలు గడచిన రెండుదశాబ్దాలకాలంలో ముగించబడినాయి. ఇంకా అనేక యితర మధ్య రకం, చిన్నరకం పథకాల పనులు చురుగ్గా అమలు జరుగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 1968 మార్చి 31 నాటికి స్థాపిత జల విద్యుత్, థర్మల్ విద్యుచ్ఛక్తి 641 మె.వా.లు వుంది. శబరికి ఉపనది అయిన సీలేరుపైగల నాలుగు ప్రాజెక్టులలో మాచ్‌కండ్ మొదటిది. ఒరిస్సాతో కలిసి నిర్మిస్తున్న మరొక ప్రాజెక్టు బలిమెల. సీలేరుపై నిర్మిస్తున్న ఈ ప్రాజెక్టు పనిని 1962లో చేపట్టారు. ఇది ఎగువ సీలేరు ప్రాజెక్టుకు నిరంతరం 2100 క్యూసెక్కుల నీటిని అందిస్తుంది. ఎగువ సీలేరు జలవిద్యుత్ పథకంక్రింద 1967 లో 60 మె.వా.ల ఒక సెట్టును, 1968లో యింతే శక్తి కలిగిన మరొక సెట్టును వినియోగంలోనికి తెచ్చారు. దిగువ సీలేరు ప్రాజెక్టుకు నిర్మాణం జరుగుతున్నది. 1973_74 నాటికి బహుశః దీని నిర్మాణం పూర్తవుతుంది.

## థర్మల్ విద్యుచ్ఛక్తి

రాష్ట్రంలో థర్మల్ విద్యుచ్ఛక్తి అభివృద్ధి శీఘ్రగతిని జరుగుతున్నది. రెండవ ప్రణాళికాకాలంలో, 37.5 మె.వా.ల స్థాపిత విద్యుదుత్పత్తి శక్తికలిగిన రామగుండం థర్మల్ కేంద్రాన్ని వినియోగంలోనికి తేవడం జరిగింది. 62.5 మె.వాల శక్తికలిగిన మరో విద్యుత్ కేంద్రాన్ని త్వరలోనే వినియోగంలోనికి తెస్తారు. కొత్త గూడెం థర్మల్ పథకం మొదటిదశ పనులను మూడవ ప్రణాళికా కాలంలో ప్రారంభించారు. ఈ థర్మల్ ప్రాజెక్టు మొదటి దశ, రెండవదశ పనులను 1967_68లో పూర్తి చేశారు (2 × 62.5 మె.వా.లు] కొత్తగూడెం థర్మల్ ప్రాజెక్టు సింగరేణి బొగ్గుగనుల ప్రాంతపు మధ్యభాగంలోవుంది. యేటా 1,000 మె.వా.ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తిచేయగల సూపర్ థర్మల్ యంత్రసముదాయాన్ని పెంపొందించదలచారు. దీనికి కిన్నెరసాని ఆనకట్టనుంచి నీరు లభిస్తుంది.

## రేవులు

రాష్ట్రంలో భారీరేవు అయిన విశాఖపట్నం, రెండుమధ్య రకం రేవులైన కాకినాడ, మచిలీపట్నంలతో సహా ఏడు సర్వ



సరళసాగర్-సైఫన్ ఆనకట్ట



మాచ్‌ఖండ్ జల విద్యుత్ప్రథకం : పవర్ హౌసూ, పెన్‌స్టాక్ పైపులూ

సమగ్రమైన రేవులు వున్నాయి. విశాఖపట్నం తూర్పుతీరంలో మద్రాసు, కలకత్తాల మధ్యవుంది. ఇది రైలు మార్గాలతో కలిసి వుంది. మంచి రక్షణ కలిగిన రేవుయిది. 600 అడుగుల కాలువను యిది కలిగింది. ఈ రేవునుంచి ముడి మ్యాంగనీసు, ఇనుము మొదలైన ఖనిజాలు విదేశాలకు ఓడలలో ఎగుమతి చేయబడు తుంటాయి. విశాఖ పట్నంలోని నౌకానిర్మాణ కేంద్రం దేశంలోని నౌకానిర్మాణ పరిశ్రమలో ప్రముఖపాత్ర వహిస్తున్నది. ఈ నౌకా నిర్మాణ కేంద్రంలో వార్షిక ఉత్పత్తి శక్తిని మూడు నౌకల నుంచి ఆరు నౌకలకు పెంచడానికి తలపెట్టారు. డ్రైడాక్ నిర్మాణం జరుగుతున్నది. విశాఖపట్నం రేవుకు సుమారు రూ. 37 కోట్లు ఖర్చయ్యే ఔటర్ హార్బరు ప్రాజెక్టును మంజూరు చేశారు. దీని నిర్మాణం పూర్తికావడానికి నాలుగు సంవత్సరాలు పట్టుతుంది. మచిలీపట్నం, కాకినాడ రేవులను అభివృద్ధిపరచడానికి కూడా చర్యలు తీసుకుంటున్నారు.

## కమ్యూనికేషన్లు

రోడ్డు రవాణా సౌకర్యాలు తగినంతగా లేవిదే అభివృద్ధి సాధ్యంకాదు. శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుమలై కొండల మీదా శ్రీ మల్లికార్జునస్వామి శ్రీ శైలం పర్వతంమీదా, శ్రీ నృసింహ స్వామి, సింహాచలం కొండమీదా వేంచేసివున్నారు. ఈ ప్రదేశాలకు పాములమాదిరి మెలికలు తిరిగే చక్కని ఘాట్‌రోడ్లు నిర్మించ బడినాయి. మనరాష్ట్రంలోని ఘాట్‌రోడ్ల నిడివి 300 మైళ్లకు పైగావుంది. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో ప్రభుత్వా నికి చెందిన రోడ్లనిడివి 6,817 మైళ్లువుంది. 1967–69 నాటికి వీటి నిడివి 13,924 మైళ్లకు పెరిగింది. ఈ విధంగా గత పన్నెండు సంవత్సరాలలో కమ్యూనికేషన్ల రంగంలో గణనీయమైన అభి వృద్ధి జరిగింది. భారీ వంతెనలు అనేకం నిర్మించబడినవి. వాటిలో పేర్కొనదగినవి–1. భద్రాచలంవద్ద గోదావరినదిమీద నిర్మించిన వంతెన, 2. రంగాపూర్‌వద్ద కృష్ణానదిమీద నిర్మించిన వంతెన, 3, కర్నూలువద్ద తుంగభద్రానది మీద నిర్మించిన వంతెన 4. సిద్ధాంతం వద్ద వాసిష్ఠనదిమీద నిర్మించిన వంతెన, 5. అలం పురం వద్ద గౌతమీ నదిమీద నిర్మించిన వంతెన. శ్రీకాకుళం వద్ద నాగావళినదిమీద, అనకాపల్లివద్ద శారదానదిమీద, కడంవద్ద గోదావరి మీద భారీ వంతెనలను నిర్మించదలచారు. భద్రాచలం సమీపంలో

శబరి నదిమీద వంతెన నిర్మించబడుతున్నది. రాజమండ్రివద్ద గోదావరి నదిమీద నిర్మించబడుతున్న రెండవ రైలు వంతెన పని పూర్తి కావచ్చింది. దీనిని రైలు-రోడ్డు వంతెన చేయాలన్న రాష్ట్ర ప్రభుత్వపు ప్రతిపాదనను కేంద్రం ఆమోదించింది. రెండువైపులా 4 అడుగుల కాలిబాటలతో సహా 16 అడుగుల వెడల్పుగలరోడ్డు మార్గం నిర్మించబడుతున్నది. జాతీయ రహదారులను పూర్తిగా అభివృద్ధి పరచడానికి రాష్ట్రానికి సుమారు రూ. 50 కోట్లు అవసరం. కాకినాడవద్ద ఉప్పుటేరుపై నిర్మించిన వంతెన "ప్రెస్ట్రెస్డ్ కాంక్రీట్ పద్ధతి"లో కట్టబడిన నిర్మాణానికి మంచి ఉదాహరణ. కమ్యూనికేషన్ సాధనాలు ప్రగతికి సోపానాలు. ప్రధాన రోడ్డు మార్గాలనుంచి ప్రతి గ్రామానికీ లింక్‌రోడ్డులను నిర్మించి పట్టణాలు, పల్లెలకు మధ్య సన్నిహితత్వాన్ని ఏర్పర్చాలని ఆంధ్రప్రదేశ్ ఆశిస్తున్నది.

## టౌన్‌ప్లానింగ్

జనాభా పెరుగుదలతో టౌన్‌ప్లానింగ్, గృహవసతి పెద్ద సమస్యలుగా తయారవుతున్నాయి. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాల కొరకూ, తిరుపతి, గుంటూరు, రాజమండ్రి, విశాఖపట్నం విజయవాడ తదితర ముఖ్యమైన పట్టణాల కొరకూ పట్టణ అభివృద్ధి ప్రణాళికలు రూపొందించబడినాయి. ఇవి కొంతవరకు అమలు పరచబడినాయి. ఆంధ్రప్రదేశ్‌లో బాగా ప్రణాళికా బద్ధంగా నిర్మించబడిన పట్టణం కాకినాడ. హైదరాబాదు నగరం శీఘ్రగతిని అభివృద్ధిజెందుతున్నది. విశాల హైదరాబాదు నగరపు "బృహత్తర ప్రణాళిక" 100 చదరపు మైళ్ళకు విస్తరించి వుంటుంది. నగరపు మెట్రోపాలిటన్ రిజినల్ ప్రణాళిక 999 చదరపు మైళ్ళకు వర్తిస్తుంది.

1960 జూలైలో స్థాపించబడిన రాష్ట్ర గృహనిర్మాణ మండలి హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో పెంపొందుతున్న జనాభాకు గృహవసతి కల్పించడానికి ఉపయుక్తమైన కృషి చేస్తున్నది. ఇప్పటి వరకు పలురకాల యిండ్లు 3581 నిర్మించబడి కేటాయించబడినవి. కార్మిక తరగతుల కొరకు నిర్మించిన చౌక ధరలయిండ్లు కూడా వీటిలో వున్నాయి.

## పరిశ్రమలు

మనరాష్ట్రం వ్యవసాయ ప్రధానమైనది కావడంచేత యిచ్చట పారిశ్రామిక అభివృద్ధి మెల్లగా సాగుతున్నది. అయితే యిందుకు కారణం ఖనిజసంపద కొరతకాదు. సాంకేతిక విషయ పరిజ్ఞానం కొరతకూడా కాదు. పరిశ్రమల స్థాపనపట్ల ఆసక్తిగల వారు లేకపోవడమే ఈ పరిస్థితికి కారణం. అయితే ఇటీవల మైనింగ్, కాగితం, ఉక్కు, ఫెర్రో అల్లాయ్స్, భారీవిద్యుత్ పరికరాలు, యంత్ర పరికరాలు, ఎయిరోనాటిక్స్, ఎరువులకు సంబంధించిన పరిశ్రమలూ, రక్షణ వ్యవస్థకు సంబంధించిన పరిశ్రమలూ రాష్ట్రంలో విరివిగా ఏర్పడి శీఘ్రంగా అభివృద్ధి జెందుతున్నాయి. ఇటీవలికాలంలో రాష్ట్రంలో అనేక పారిశ్రామిక వాడలను స్థాపించడం జరిగింది. ప్రైవేటు రంగంలో లఘుపరిశ్రమలు ప్రోత్సహించబడుతున్నవి. విశాఖపట్నంలో కాల్టెక్స్ నూనెశుద్ధి కర్మాగారం, కోరొమండల్ ఎరువుల కర్మాగారం, పోలిథీన్ ఫ్యాక్టరీలు వున్నాయి. విశాఖపట్నం వద్ద తుత్తునాగాన్ని కరిగించే యంత్రాగారాన్నీ, ఉక్కు ఫ్యాక్టరీనీ, రామగుండం వద్ద బొగ్గు ప్రాతిపదికగాగల ఎరువులఫ్యాక్టరీనీ స్థాపించడానికి ప్రతిపాదనలు వున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ సంపదకూడా పుష్కలంగావుంది. బొగ్గు నిక్షేపాలు అపారంగావున్నాయి. గూడూరువద్ద మాంగనీసును తీయడం జరుగుతున్నది. ఇటీవల జరిపిన పరిశోధనలవల్ల ఇనుమెళ్ళ, భీమడోలు ప్రాంతాలలో ఒక ప్రత్యేకరకం బంకమన్ను లభించగలదన్ని తేలింది. అచట ఒక పరిమళ ద్రవ్యాల ఫ్యాక్టరీని నెలకొల్పదలుస్తున్నారు. గుంటూరుజిల్లా అగ్నిగుండాలలో అధిక పరిమాణంలో రాగిఖనిజం కనుగొనబడింది. అచ్చట త్వరలోనే బహుశః ఒకపెద్ద పారిశ్రామిక సంస్థ ఏర్పడవచ్చు. విశాఖపట్నంలోని ఎరువుల కర్మాగారంకాక కొవ్వూరు, తణుకులలో రెండుచిన్న యూనిట్లు వున్నాయి. రాయలసీమలోని అనంతపురం చుట్టుప్రక్కల పదిమైళ్ళ ప్రాంతంలో బంగారం నిక్షేపాలు వున్నట్లు అక్కడజరిపిన పరిశీలనలలో వెల్లడైంది.

అయితే ఆంధ్రప్రదేశ్‌లో అనావృష్టికీ, క్షామాలకీ గురి అయ్యే ప్రాంతాలూ, వెనుకబడిన ప్రాంతాలూ చాలావున్నాయి. కాబట్టి వచ్చే సంవత్సరాలలో తన ఆర్థిక వ్యవస్థను మరింత తీవ్రంగా అభివృద్ధిపరచుకోవడానికై మన రాష్ట్రం యింకాఎక్కువ దీక్షతో కృషి చేయవలసివున్నదని మనవిచేస్తున్నాను. ★

---

# సమైక్యత ద్వారా సంపూర్ణ వికాసం

---




# చిన్నతరహా సేద్యపునీటి వనరులు

వి. పురుషోత్తమరెడ్డి

చిన్నతరహా నీటివనరుల విషయమై ప్రస్తావించే సందర్భంలో ప్రప్రథమంగా మనరాష్ట్రంలో యిటీవల సంభవించిన ఘోరవిపత్తు స్మృతికి రాకమానదు మూడు పర్యాయాలు తుఫాను మూలంగా దెబ్బతిన్న కోస్తా జిల్లాల ప్రజలకూ, చిత్తూరు, ఖమ్మం జిల్లాల ప్రజలకూ నా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాను. బాధితులకు ప్రభుత్వం అని విధాలా సహాయం అందజేస్తున్నదనీ ముందుకూడా సహాయపడుతుండగలదనీ వేరే చెప్పనక్కరలేదు. ప్రకృతిసిద్ధంగా కల్గిన ఈ విపత్తును దాటి బయట పడడానికి అక్కడి ప్రజలకు ధైర్యసాహసాలు, మనోనిబ్బరం కలుగ జేయుటకు భగవంతుని ప్రార్థిస్తున్నాను.

వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల మనరాష్ట్రంలో జలసంపద సమృద్ధిగావుంది. ఇప్పుడు సాగుఅవుతున్న భూములను యింకా అభివృద్ధిపరచి, క్రొత్తగా అనేకవేల ఎకరాల భూమిని సాగు క్రిందికి తేవడానికి అవకాశాలు ఎన్నోవున్నాయి. మన రాష్ట్రంలో జలసంపదను సక్రమంగా వినియోగించినట్లయితే చిరకాలంగా అనావృష్టికి, కరువుకాటకాలకూ గురిఅవుతున్న ప్రాంతాల ప్రజలు ఆహారోత్పత్తి విషయంలో స్వయంసమృద్ధి పొందడానికి వీలు వుంటుంది. అంతేకాదు ఇంతవరకు తరుగు ప్రాంతాలుగావుండి, వ్యవసాయంలో వెనుకబడిన ప్రాంతాలే మిగులు ప్రాంతాలుగా మారి పొరుగు రాష్ట్రాలకు ఆహారధాన్యాలు సరఫరాచేసే స్థితిలోకి వస్తాయి ఇతరరంగాలలో ప్రగతిసాధించేముందు నీటివనరుల అభివృద్ధి ద్వారా పంటలు సమృద్ధిగా పండించటం చాలా అవసరం. అందువల్ల దేశం సుభిక్షమవుతుంది విదేశాలపై ఆధారపడడం వుండదు. విదేశీమారక ద్రవ్యం మిగులుతుంది. తద్వారా ఆదాచేసే డబ్బును యితర రంగాల అభివృద్ధికి వినియోగించవచ్చు.

అనాదిగా మన పూర్వీకులు ఆహార, వాణిజ్యపంటలు పండించడానికి జలాలను నిలువచేసేందుకూ, నదులను సేద్యానికి ఉపయోగించేందుకూ వాపీకూపతటాకాలను అనేకం నిర్మించారు. క్రీస్తు పూర్వం నుంచీ దక్షిణ భారతదేశంలో పెద్దపెద్ద చెరువుల క్రింద అనేకవేల ఎకరాల భూమి సాగుఅయినట్లు చారిత్రికాధారాల వల్ల మనకు తెలుస్తున్నది. కాకతీయ, విజయనగర రాజులు వ్యవసాయాభివృద్ధి కొరకు అనేక జలాశయాలు నిర్మించారు. వరంగల్లు జిల్లాలో రామప్ప, లక్నావరం, పాఖాల చెరువులు, ఖమ్మం జిల్లాలో బయ్యారం నెల్లిపాక చెరువులు, కర్నూలు, అనంతపురం చిత్తూరు జిల్లాలో కంభం, బుక్కపట్నం, ధర్మవరం వ్యాస సముద్రం చెరువులు యిందుకు దృష్టాంతరాలుగా నేటికీ చెక్కుచెదరకుండా నిలిచివున్నాయి. వీటిక్రింద అనేకవేల ఎకరాల భూమి నేటికీ సాగుఅవుతున్నది. జలాశయ నిర్మాణాల విషయంలో మన పూర్వీకుల ప్రతిభావిశేషాలకు యివి మచ్చుతునకలు

ఆంధ్రప్రదేశ్‌లో అనేక ప్రాంతాలలో వ్యవసాయం వర్షంపైన ఆధారపడివుంది. ఇవితరచుగా అనావృష్టికి లోనవుతున్నాయి. అందుకని వర్షపుజలాలను నిలువచేయడం అవసరమవుతున్నది.

## స్వాతంత్ర్యానంతర కాలంలో

స్వాతంత్ర్యానంతరం, పంచవర్ష ప్రణాళికల ద్వారా చిన్నతరహా నీటివనరులను పెంపొందించడానికి గట్టిచర్యలు తీసుకోబడినాయి. స్వల్పకాలంలోనే నీటిపారుదల సౌకర్యాలను పెంపొందించాలంటే చిన్నతరహా నీటివనరులను అభివృద్ధిపరచడం మినహా వేరేమార్గంలేదు. పెద్దపెద్ద నదులపైన బహుళార్థసాధక ప్రాజెక్టులు నిర్మించడం కూడా అవసరమే అయితే యిది వ్యయప్రయాసలతో కూడిన పని. వీటికి పెట్టుబడి చాలా అవసరం. నిర్మాణం పూర్తి అయ్యేందుకు చాలాకాలం పడుతుంది. కనుక వీటివల్ల కలిగే లాభాలు వెంటనే కనిపించవు. అయితే చిన్నతరహా నీటిపారుదల ప్రాజెక్టులవల్ల కలిగేఫలితాలు స్వల్పమైనవికావు. వీటికి పెట్టుబడి చాలా తక్కువ, అయ్యే ఖర్చు ప్రాజెక్టుకు ఒకటికి రూ.15 లక్షలకు మించదు. పని కొద్దికాలంలో పూర్తి అవుతుంది. ఫలితాలు కూడా వెంటనే కనిపిస్తాయి. వీటి నిర్మాణానికి విదేశమారక ద్రవ్యం అవసరం లేదు పెద్దపెద్ద యంత్రపరికరాలు అవసరంలేదు. విదేశీ సాంకేతిక సహాయం అక్కరలేదు కావల్సిన సరంజామా అంతా స్థానికంగానే లభిస్తుంది. వీటివల్ల సాధారణంగా అంతర్ రాష్ట్ర సమస్యలు ఏర్పడవు. పని సాఫీగా జరుగుతుంది. పరిమిత ధనంతో అనేక పథకాలు చేపట్టవచ్చు.

## భూగర్భ జలసంపద

మనరాష్ట్రంలో భూగర్భజలసంపదను వినియోగించే విషయం యింకా పరిశోధనాదశలోవుంది. గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాల్లో పబ్లిక్‌వర్క్సు శాఖ 88 బావులలో భూగర్భజల పరిశోధనచేస్తున్నది. తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో వ్యవసాయ శాఖ, అగ్రోయిండస్ట్రీస్ శాఖలు కూడా ఈ విషయమై పరిశోధనలు చేస్తున్నాయి. అంతేకాక భారత ప్రభుత్వ భూగర్భ పరిశోధన శాఖకూడా ఈవిషయంలో శ్రద్ధతీసుకొని పనిచేస్తున్నది. ఈపని అంతా ముగిసిన తరువాత భూగర్భజలాల

వినియోగ. విషయమై ఒక సమగ్రమైన కార్యక్రమం రూపొందించ బడుతుంది

చిన్నతరహా నీటి వనరుల విషయమై ముఖ్యంగా పబ్లిక్ వర్క్సు శాఖ చేస్తున్న కృషి వ్యవసాయరంగం అభివృద్ధికి ఎంతో తోడ్పడుతున్నది.

ప్రణాళికలో కేటాయించిన నిధుల నుంచి కొత్త పథకాలను అమలుపరచడం, పాతవాటిని మరమ్మతుచేయడం జరుగుతుంది. మొదటి పంచవర్షప్రణాళికకు పూర్వం ఈ విషయమై అంతశ్రద్ధ చూపడం జరుగలేదు. అయితే ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలాలలో గణనీయమైన ప్రగతి జరిగిందని చెప్పవచ్చు. ఈ పథకాల క్రింద మొదటి ప్రణాళికలో రూ 352 లక్షలు రెండవ ప్రణాళికలో రూ. 438 లక్షలు, మూడవ ప్రణాళికలో రూ. 1830 లక్షలు ఖర్చుపెట్టడం జరిగింది.

ఇంత అభివృద్ధిజరిగినా చేయవలసింది యింకా ఎంతోవుంది. అవసరమైనంత డబ్బు కేటాయించడం సాధ్యపడడంలేదు. గత సంవత్సరం అనావృష్టి ఏర్పడినందువల్ల కరువు నిధుల నుంచి ఎక్కువ డబ్బు వినియోగించడం జరిగింది. ఇటీవల వచ్చిన తుఫాను, అధికవర్షాల మూలాన కోస్తా జిల్లాలలోనూ చిత్తూరు, ఖమ్మం జిల్లాలలోనూ అనేక చెరువులు చెడిపోయాయి. తత్ఫలితంగా పైర్లకు నీరులేకుండా పోయింది. ఈజిల్లాలలో చెడిపోయిన చెరువులను త్వరితగతి బాగుచేయడానికి ప్రభుత్వం సత్వర చర్యలు తీసుకున్నది. మూడు ప్రణాళికాకాలాలలోనూ, తదుపరి సంవత్సరాలలోనూ చిన్న నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద మొత్తం రూ. 37 కోట్లు ఖర్చు పెట్టడం జరిగింది.

1965_66 సంవత్సరంలో స్వల్పకాలిక నీటిపారుదల సౌకర్యాలు ఏర్పాటుచేసి ఆహారరంగంలో సత్వర ప్రగతి సాధించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం లిఫ్టు యిరిగేషన్ కార్యక్రమాన్ని తలపెట్టింది. భారత ప్రభుత్వం యిచ్చిన 44 లక్షల ఆర్థిక సహాయంతో 55 పథకాలు అమలుపరచబడినవి. ఇందుకొరకు మొత్తం 69 లక్షల 22వేల రూపాయలు ఖర్చు అయినాయి. వీటి క్రింద అదనంగా 31,851 ఎకరాల భూమిసాగు అవుతున్నది. మరి కొన్ని లిఫ్టు యిరిగేషన్ పథకాలు అమలుపరచాలని ప్రభుత్వం సంకల్పిస్తున్నది.

ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో చిన్నతరహా నీటిపారుదల పథకాల నిమిత్తం 2 కోట్ల 10 లక్షల రూపాయలు కేటాయించ బడినవి. ఇంతేగాక తెలంగాణా అభివృద్ధి కొరకు ప్రతి జిల్లాకు ఒక కోటి రూపాయలచొప్పున కేటాయించిన మొత్తంలో నుంచి తొమ్మిది జిల్లాలలో చిన్నతరహా నీటిపారుదల పథకాలకు 31 లక్షలు కేటాయించబడినవి. ఈ డబ్బుకు సంబంధించిన పథకాలను సిద్ధంచేసే అధికారం జిల్లాపరిషత్తులకు యివ్వడంజరిగింది. దాదాపు అన్ని జిల్లాలలోనూ. చేపట్టవలసివున్న పథకాలకు తుది మెరుగులు దిద్దడం అయింది. ఈ పనులను పబ్లిక్ వర్క్సుశాఖ నిర్వహిస్తుంది. 1970 మార్చి నెలాఖరువరకు బహుశః 350 పథకాలు పూర్తవుతాయి. ఇందువల్ల 1 లక్ష 25 వేల ఎకరాలకు అదనంగా నీటిపారుదల జరగడమేకాకుండా ప్రస్తుతపు ఆయకట్టులో 75 వేల ఎకరాలకు నీటివసతి లభిస్తుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరువాత గత 13 సంవత్సరాలలో చిన్నతరహా నీటిపారుదల పథకాల క్రింద మొత్తం రూ. 30 కోట్ల 50 లక్షల రూపాయల ఖర్చుతో రూ. 799 పథకాలు అమలుపరచబడినవి. వీటిక్రింద 2 లక్షల 11 వేల ఎకరాలు సాగు అవుతున్నాయి.

ఉపరితల జలసంపదను సద్వినియోగం చేయడానికి యింకా ఎంతోకృషి చేయవలసివుంది. భూగర్భజల వినియోగానికి కూడా తీవ్రంగా పరిశోధనలు జరుగుతున్నాయి. ఇంకా రూ. 27 కోట్ల 73 లక్షల రూపాయల ఖర్చుతో అదనంగా 3 లక్షల 46 వేల ఎకరాలను సాగుచేయడానికి 1227 క్రొత్త పథకాలు ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి. అయితే డబ్బు కొరతవల్ల అనుకున్నంత చురుకుగా పనిజరగడంలేదు. చేపట్టిన పథకాలు పూర్తికావాలంటే 6 కోట్ల 80 లక్షల రూపాయలు కావాలి. సకాలంలో నిధులు లభించినట్లయితే ప్రజల సహకారంతో మనంతలపెట్టిన కార్యక్రమాలవల్ల బాగుపడేది ప్రజలే కనుక శక్తివంచన లేకుండా పథకాల అమలుకు సహాయపడవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను. ఆయకట్టును పూర్తిగా అభివృద్ధిపరిచి అధికాహారోత్పత్తికి కృషిచేయవలసిందని మనవి చేస్తున్నాను.

## ఇంజనీర్ల సమావేశం

నీటి వనరుల పథకాల సర్వేను, నిర్వాహణను సక్రమపద్ధతిలో త్వరితగతిని జరిపేలక్ష్యంతో ఈ మధ్యనే రాష్ట్రంలోని యింజనీర్ల సమావేశం ఏర్పాటుచేయబడింది. ఈ సమావేశంలో కొన్ని నిర్ణయాలు గైకొనబడినవి. ముఖ్యంగా కొత్తపథకాల విషయమై ప్రస్తుతం అమలులోనున్న ఆదాయం లభించవలెనన్న రూ.1.5 ప్రాతిపదిక మూలాన చాలా పథకాల వ్యయం పెరుగుదల దృష్ట్యా ఈ పరిమితిని తగ్గించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది. అదేవిధంగా మరమ్మతుల విషయంలో యిప్పుడున్న పరిమితిని మార్చడానికి నిర్ణయించబడింది పనులు సత్వరంగానూ, సక్రమంగాను అమలు జరగడానికి వీలుగా జిల్లాస్థాయిలోనూ అంతకు పైస్థాయిలోనూ ప్రతిపని ప్రగతిని గురించి పరిశీలించడానికి చర్యలు గైకొనబడినవి. అమలుజరుగుతున్న పనులను ఆకస్మాత్తుగా పర్యవేక్షించడానికి ఉన్నతాధికార్లకు ఆదేశాలు యివ్వబడినవి.

మనరాష్ట్రం వ్యవసాయ రంగంలో కూడా చాలా అభివృద్ధి సాధించినా కొన్ని ప్రాంతాలు వెనుకబడి వున్నవన్నది నిర్వివాదాంశం. అభివృద్ధి పొందకపోవడానికి ముఖ్యకారణం అనావృష్టివల్ల ఏర్పడిన నీటివనరులకొరత కనుక యిటువంటి ప్రదేశాలలో వర్షాభావం వలన కలుగుతున్న యిబ్బందులను ఎదుర్కొనడానికి ప్రత్యేకంగా కొన్ని పథకాలను రూపొందించవలసి వుంటుంది. ఈ విషయంలో ప్రభుత్వ కృషిచేస్తున్నది. కొద్దికాలంలోనే వీటి సత్ఫలితాలు లభించగలవని ఆశిస్తున్నాను.

వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల మనరాష్ట్రంలో కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పెన్నా నదులు ఈ ప్రదేశాన్ని సస్యశ్యామలం చేస్తున్నాయి. కొద్దికాలంలో కొద్దిఖర్చుతో చిన్ననీటి వనరులను అభివృద్ధి పరచుకొని వ్యవసాయానికి వినియోగించుకో

దానికి అనేక పథకాలు చేపట్టాము. ఇవన్నీ పూర్తి అయిననాడు దేశంలో కరువంటూవుండదు. ప్రజలు సుసంపన్నులై సుఖ శాంతులతో జీవనం గడుపుతారు. ఈ లక్ష్యసాధనకొరకు మన మందరం కృషిచేద్దాం.

ఈ సందర్భంలో ఒకముఖ్యమైన విషయాన్ని ప్రజలదృష్టికి తీసుకొనిరావడం అవసరమని భావిస్తున్నాను. భారతదేశంలో అనాదినుండి ధనవంతులు, ప్రజల సహాయార్థం దానధర్మాలు చేయ డమేగాక సత్రాలు, మందిరాలు, పాఠశాలలు, రోడ్లవెంబడి బావులు మొదలైనవికట్టించి తమపేరును, తమ వంశీకుల పేరును చిర స్థాయిగా నిలబెట్టుకున్నారు. ఇదేవిధంగా, యీనాడు అవసరమున్న ప్రాంతాలలోచిన్నచిన్న కుంటలనుకానీ, చెఱువులనుకానీ లేక ఆనకట్టలను కానీ కట్టడానికి ముందుకువచ్చి మారుతున్న కాలానికి అనుగుణంగా దాతలు వారి దాన చర్యలు రూపొందించుకొనగలరని ఆశిస్తున్నాను. అటువంటి దాతలకు వివరాలను సేకరించి యివ్వ డానికి పి.డబ్ల్యు.డి. శాఖవారు ఎల్లప్పుడూ సిద్ధంగా వుంటారు.

అధికంగా తమ ప్రాంతపు ప్రజలకు సహాయపడడానికీ, తమకీర్తిప్రతిష్ఠలను నిలబెట్టుకోడానికీ, ఈ ఆధునిక యుగంలో యిది చక్కని అవకాశమని వారికి మనవిచేస్తున్నాను. త్వరలోనే ఈ నవీన పథంలో అంకురార్పణ చేయడానికి దాతలు ఉదారంగా ముందుకురాగలరనీ, మనరాష్ట్రం ఈ విషయంలో సైతం యావ ద్భారతదేశానికి ఆదర్శప్రాయం కాగలదనీ గాఢంగా నము తున్నాను. * ☘

---

## పరిపాలనా విషయాలు

### తెలంగాణా ఉద్యోగుల ఫిర్యాదుల విచారణకు ఉన్నతాధికార సంఘం నియామకం

తెలంగాణా ప్రాంతానికి చెందిన గజిటెడ్, నాన్-గజిటెడ్ ఉద్యోగుల విజ్ఞాపనలను పరిశీలించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అలహాబాదు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయాధికారి శ్రీ నసీరుల్లాబేగ్‌ను అధ్యక్షునిగాను, రెవిన్యూబోర్డు మెంబరు శ్రీ ఎక్బాల్ చంద్‌నూ, రెవిన్యూశాఖలో ప్రత్యేక కార్యదర్శి శ్రీ. యస్. కృష్ణస్వామిరావు సాహెబ్‌ను సభ్యులుగానూ నియమిస్తూ ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది. ఈ సంఘం ప్రతి కేసులోను ఏ చర్యతీసుకోవడం సముచితమో భావించి ఆ విషయాన్ని గురించి ప్రభుత్వానికి సలహాఇస్తుంది.

పిటిషనులను పరిష్కరించేందుకు గాను ఈ ఉన్నతాధికార సంఘం అవసరమని భావించినట్లయితే ప్రభుత్వ కార్యదర్శిని, లేక శాఖాధిపతిని లేక ఆయన ప్రతినిధులను లేక వీరిద్దరినీ కో-అప్టు చేసుకోవచ్చును.

ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘం 1969 ఆగస్టు 12,18,21 తేదీలలో తెలంగాణా ఉద్యోగుల ఫిర్యాదుల విషయమై విచారణ చేసేందుకు ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించాలని ప్రభుత్వానికి సిఫార్సు చేసింది.

ఈ సంఘం యొక్క విచారణీయాంశాలు ఇవి :-

1. పదవుల సమానీకరణ, సర్వీసుల ఏకీకరణ విషయంలో భారత ప్రభుత్వ ఆదేశాలను అమలుపరచపోవడం.

2. తెలంగాణా ఉద్యోగుల సర్వీసు పరిస్థితులను కాపాడే ఉద్దేశంతో రిక్రూట్మెంటు, ప్రొమోషను జీతం మున్నగు విషయాలకు సంబంధించిన ప్రత్యేక నియమావళిని అమలుపరచక పోవడం.

ఈ విషయాలకు సంబంధించి ఫిర్యాదులను పరిశీలించిన తరువాత ఈ సంఘం ప్రభుత్వానికి తన సలహా ఇస్తుంది.

ఈ సంఘానికి నివేదించిన ఏ వినతి పత్రంలోనైనా ఇతర ఉద్యోగులకు హాని కలిగినట్లు ఈ సంఘానికి అభిప్రాయం ఏర్పడినట్లయితే అది అట్టి వ్యక్తుల వాఙ్మూలాలను వింటుంది.

ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం ఉద్యోగులకు వున్న ఫిర్యాదులను ఈ సంఘం పరిశీలించదు. ఏకీకరణకేడర్ల విషయంలో సీనియారిటీకి సంబంధించిన ఫిర్యాదులను కూడా ఈ సంఘం పరిశీలించదు. ఎందుకంటే ఇలాంటి విషయాలను పరిశీలించేందుకు భారత ప్రభుత్వం ఇదివరకే చట్టబద్ధంగా సలహా సంఘాలను నియమించింది.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా నష్టపడిన తెలంగాణా ప్రభుత్వోద్యోగులు ఉన్నతాధికార సంఘ విచారణీ యాంశాలకు లోబడిన ఫిర్యాదులను గురించి ఈ సంఘానికి విజ్ఞాపనలు పంపవచ్చు. విజ్ఞాపన ప్రతిని ఒకదానిని నేరుగా ఉన్నతాధికార సంఘం అధ్యక్షులు, సాధారణ పరిపాలన (యస్. ఆర్.) శాఖకు పంపవలెను.

### ఒంగోలు జిల్లా

ఈయేడు ఫిబ్రవరి 2వ తేదీ నుండి ఒంగోలుజిల్లా కొత్తగా ఏర్పాటుచేయబడింది. ఇది మనరాష్ట్రంలో 21వ జిల్లా. మార్కాపురం, కందుకూరు, ఒంగోలు రివిన్యూ డివిజన్లు కలిపి ఒంగోలు జిల్లాగాఏర్పాటు చేశారు. పరిపాలనా నిర్వహణ మరింత పటిష్టంగా జరగడానికి యీ కొత్తఏర్పాటు ఉద్దేశించబడింది.

కొత్త జిల్లాలోని తాలూకాలు 9 ;

మార్కాపురం, గిద్దలూరు, కందుకూరు, పొదిలి, కనిగిరి, దర్శి, ఒంగోలు, అద్దంకి, చీరాల.

### గజపతి నగరం తాలూకా

విశాఖపట్టణం జిల్లాలో కొత్తగా ఏర్పాటైన గజపతినగరం తాలూకాలో 177 గ్రామాలు వున్నాయి. ఈ తాలూకా 1969 నవంబరు 15వ తేదీ నుండి ఏర్పాటు అయినట్లు పరిగణిస్తారు.




గంధం జోయెల్

నన్నొక దివ్య ఆదర్శానికి
బలియైపోనీ !
నన్నేదో అపూర్వ ఆశయానికి
చెలికాణ్ణై పోనీ !
ఈ మునిమాపుల మధ్య
కాంతిపుంజమునై,
కాలువగట్టున వికసించిన
ఎఱ్ఱగన్నేరు కుసుమంలా
అందాన్ని విరబోయనీ !
ఆనందాన్ని వెదజల్లనీ !
ఉషఃకాంతి వంటి
ఊహలకు రెక్కలు బిగించి,
ఊరూరా నన్ను తిరగనీ !
కలతల్ని మరచి
కలకాలం బ్రతకనీ !
నా ఏడ్పును, సంతోషం
తుండుగుడ్డతో తుడుచుకోనీ !
ఆకాశంలో మెరుపులా
ప్రాకారాలు నిర్మించుకోనీ !
రంగురంగు పువ్వుల్లా
చెంగును నవరించుకోనీ !
మధుర జీవన మురళీరవాన్ని
మనసువిప్పి పాడుకోనీ !
అపజయాల్ని గణించక
విజయాల్ని సాధించనీ !
విశ్వమానవ సేవా దీక్షతో
లోకంలో నన్ను బ్రతకనీ !
అందమైన గోరువంకలా
అడుగులు వేస్తూ వేస్తూ,
ప్రేమ, సహనం గింజలను
మెల్లమెల్లగా తిననీ !
నిర్జర ప్రదేశంలోని
మైదానాల్లో, పచ్చికలా
నన్ను పెరగనీ !
పచ్చని బ్రతుకు
పందిరి మీదికి తీగలా
పైకి నన్ను ప్రాకిపోనీ !
తమ్ముడూ !
విద్వేషాల మాట
నా చెవులకు సోకనీకు
స్నేహానికి, సౌహార్దానికి
చేతులు సాచే నాకు !
అవినీతిని దుప్పటిగా కప్పకు !
గున్నమావి చెట్టుక్రింద
నిన్నటివరకూ ఆడుకున్న
నన్నుపిలిచే దేశమాత
పిలుపు విననీ !
దేశం కోసం
దేదీప్యమానమౌ
దీపంగా వెలగనీ :
నన్నొక దివ్య ఆదర్శానికి
బలియై పోనీ :

# మహాభారతము

తిరుపెగంటుల లక్ష్మణశాస్త్రి

"రాజా! 'వంశమూలక' తీర్థమునందు స్నానము చేసినవాడు స్వవంశమును ఉద్ధరించగలడు. 'కాయశోధన' తీర్థములో స్నాతుడైనవాని శరీరము పరిశుద్ధమగును. పుణ్య లోకములనుపొందును. ఆ తరువాత 'లోకోద్ధార' తీర్థమునకుపోయి స్నానము చేయవలెను. అచట పూర్వము విష్ణుదేవుడు ఎందరో లోకులను ఉద్ధరించెను. అలాగే తీర్థయాత్రికుడు కూడ లోకోద్ధారమును చేయగలడు. 'శ్రీ' తీర్థమును సేవించినవానికి సంపదలు కలుగును 'కపిలా' తీర్థములో స్నానము చేసినవానికి 'కపిలా' గోసహస్రదాన ఫలము కలుగును. 'సూర్య' తీర్థములో స్నానముచేసినవాడు సూర్య లోకమునకు పోవును. 'గోభవన' తీర్థమును సేవించి గోసహస్ర దాన ఫలమును పొందును యాత్రికుడు 'శంఖినీ' తీర్థమునకు పోయి అచటి 'దేవీ' తీర్థమునందు స్నానము చేసినచో రూపవంతుడగును. తరువాత 'ద్వారపాల_అరంతుక' తీర్థమును సేవించిన వానికి అగ్నిష్టోమఫలము కలుగును. యక్ష రాజగు కుబేరుని యొక్క ఆ తీర్థము సరస్వతీ నదిలోనున్నది. 'బ్రహ్మావర్త' తీర్థములో స్నానము చేసినవాడు బ్రహ్మలోకమునకు పోవును. అచటినుండి 'సుతీర్థకము'నకు పోయి స్నానముచేసిన వానికి పితృలోకము లభించును. అక్కడినుండి పోయి 'అంబుమతీ' క్షేత్రమునందలి పుణ్యతీర్థములందు స్నానము చేయవలెను. ఆ తరువాత, 'కాశీశ్వర' తీర్థ స్నానముచేసినవాడు సర్వరోగముక్తుడై బ్రహ్మలోకమునకు పోవును. 'మాతృ' తీర్థసేవనము చేసినచో వానికి ప్రజాభివృద్ధి, గొప్ప సంపదలు గలుగును. తరువాత 'సీతవన' తీర్థ సేవనముచేసి పవిత్రుడగును. దానికి ఈడైన తీర్థము మరియొకటిలేదు. అచటినుండి పోయి యాత్రికుడు 'శ్వావిల్లోమాపనయన' తీర్థములో స్నానమాచరించినచో అతనివెంట్రుకలు రాలిపోవును. అతడు ఉత్తమ గతికి పోవగలడు. ఆ తరువాత 'దశాశ్వమేధిక, తీర్థమును సేవించవలెను. దానిచేత ఉత్తమ లోకములు ప్రాప్తించును.

"రాజా! ఆ తరువాత 'మానుష' తీర్థమును సేవించవలెను. అచట లేళ్లు వ్యాధుని బాణములచేత పీడింపబడి ఆ తీర్థములో మునిగి మానవరూపమును పొందినవి, కనుక దానికి 'మానుష' తీర్థమని పేరువచ్చినది. అందులో స్నానము చేసిన యాత్రికుడు పాపదూరుడై స్వర్గమునకు పోవును. ఆ తీర్థమునకు తూర్పుగా క్రోశమాత్రములో 'ఆపగా' అను నొక నదికలదు. దానిని సేవించి యచట బ్రాహ్మణులకు 'శ్యామాక' (చామలు) ధాన్యముతో భోజనము పెట్టిన యాత్రికునకు సమస్త దేవ_పితృదేవులకు భోజనము పెట్టిన ఫలము లభించును. అచట ఒకనికి పెట్టిన భోజనమువలన కోటిమందికి పెట్టినంత ఫలము కలుగును. అచటినుండి బ్రహ్మకు స్థానమైన 'బ్రహ్మోదుంబర' తీర్థమునకుపోయి సేవించవలెను. అక్కడనున్న 'సప్తర్షి కుండము' నందు, కపిలుని 'కేదార' తీర్థములోను స్నానము చేసినవాడు మహా పుణ్యవంతుడగును అట్టివాడు బ్రహ్మదేవుని వద్దకుపోయి, పవిత్రుడై యుండును. కపిలుని 'కేదారము' గూడ అతి దుర్లభము. అక్కడికి పోయినవానికి, పాపములన్నియు నశించి 'అంతర్ధాన విద్య' లభించును. రాజేంద్రా! అచటినుండి తీర్థ యాత్రికుడు 'సరక' తీర్థమునకు పోవలెను. అచట కృష్ణపక్ష చతుర్దశినాడు స్నానము చేసి అచటి శంకరునకు అభిషేక పూజాదులు చేసినవాడు సర్వ కామములను పొంది స్వర్గమునకు పోవును. కురునందనా! ఈ సరక తీర్థములో మూడుకోట్ల తీర్థములు ఉన్నవి. ఈ తీర్థములన్నియు 'రుద్రకోటి' కూప, కుండ, తీర్థములందు ఉన్నవి. అచటనే 'ఇలాస్పద' తీర్థము ఉన్నది. అచట మునిగి దేవ పితృ పూజలు చేసినవాడు దుర్గతినుండి దూరుడై వాజపేయ యాగ ఫలమును పొందగలడు.

"కురుపతీ! అక్కడ 'కిందాన_కింజప్య'ములు అను రెండు తీర్థములుగలవు. వానిలో స్నానము చేసినవానికి దాన_జపముల ఫలములు అనంతములగును. 'కలశీ' తీర్థములో స్నానముచేసి

అగ్నిష్టోమ యాగఫలమును పొందును. సరక తీర్థమునకు తూర్పుగా నారదుని తీర్థముగలదు. దానికి 'అంబాజన్మ' తీర్థమని పేరు. అచట స్నానముచేసిన వానికి నారదాజ్ఞచేత ఉత్తమ లోకములు కలుగును. శుక్లపక్ష దశమినాడు 'పుండరీక' తీర్థమును సేవించవలెను. దానివలన పుండరీక యాగ ఫలము లభించును. తరువాత 'త్రివిష్టప' తీర్థమును సేవించవలెను అచట 'వైతరణి' యను పుణ్యనది ఉన్నది. దానిలోస్నానముచేసి శివపూజచేసినవానికి పుణ్యలోకములుకలుగును.అచటినుండి 'ఫలకీవన' తీర్థమునందు స్నానము చేయవలెను. దానినాశ్రయించి సహస్రసంవత్సరములు అనేక దేవతలు, మునులు తపస్సుచేయుచుందురు. 'దృషద్వతీ' తీర్థమునందు స్నానముచేసినవారు, అగ్నిష్టోమ–అతి రాత్రయాగ ఫలమును పొందుదురు. అటనుండి పోయి 'సర్వదేవ' తీర్థమునందు స్నానము చేసినవారికి సహస్ర గోదానఫలము కలుగును. 'పాణిఖాత' తీర్థమునందు స్నానము చేయుటచేత అనంత పుణ్యము లభించును. అచటినుండి 'మిశ్రక' తీర్థమునకు పోవలెను. దానిలో భగవంతుడైన వ్యాస మహాముని సమస్త తీర్థములను కలిపి యున్నాడు కనుక దానిలో స్నానము చేసినవారికి సర్వ తీర్థ స్నాన ఫలము లభించును. ఆ తరువాత 'వ్యాసవన' యాత్రచేయవలెను. అచటి 'మనోజవ' తీర్థమునందు స్నానముచేసినవాడు గోసహస్రదానఫలమును పొందును. ఆ తరువాత 'మధువటీ' క్షేత్రమున నున్న 'దేవ' తీర్థములో స్నానముచేసి పవిత్రుడు కావలెను. 'కౌశికీ–దృషద్వతీ' నదుల సంగమములో స్నానము చేసినవానికి సర్వ పాపములు దూరమగును. తరువాత 'వ్యాసస్థలీ' తీర్థమును సేవించినచో గో సహస్రదాన ఫలమును పొందును. ఆ తీర్థమునందు పూర్వము వ్యాసుడు పుత్రశోకముచేత దేహత్యాగము చేయదలచగా దేవతలా మునిని లేపి ఊరడించి ఆ ఘోరకర్మనుండి విరమింపజేసిరి. పిదప 'కిందత్త' తీర్థమును సేవించి పదియారు పిడికిళ్లు (ప్రస్థము) నువ్వులు దానముచేసిన వానికి ఋణ విముక్తికలిగి పుణ్యలోకములు లభించును. ఆ దానమునకు 'తిల ప్రస్థ దానము' అని పేరు. పిమ్మట 'వేద' తీర్థ స్నానము చేయవలెను. 'అహస్–సుదినం' అను రెండు తీర్థములలో స్నానము చేసినవానికి సూర్యలోకము లభించును. తరువాత 'మృగధూమ' తీర్థమునకు పోయి యచటి గంగానదిలో స్నానము చేసి శివపూజ చేసినవానికి అశ్వమేధ ఫలము లభించును. తరువాత 'దేవీ' తీర్థమునందు గ్రుంకవలెను. పిదప 'వామనక' తీర్థమునకు పోయి అచటి 'విష్ణుపద' తీర్థమునందు స్నానముచేసి వామనుని పూజించినవారికి విష్ణులోక ప్రాప్తికలుగును. పిదప 'కులంపున' తీర్థమునందు మునిగినవాడు స్వకులమును పావనముచేయును 'పవన' తీర్థమునందు, 'మరుత్' తీర్థమునందు స్నానముచేసిన వారికి విష్ణులోక ప్రాప్తి కలుగును. 'అమరహ్రద'మునందు స్నానముచేసి అమరలోకమును, 'శాలిహోత్ర'మునందలి 'శాలిసూర్య' తీర్థమునందు స్నాతులై గో సహస్రఫలమునుపొందుదురు.

"కురుకులాలంకారా! 'శ్రీ కుబ్జ' క్షేత్రమునందలి 'సరస్వతీ' తీర్థమునందు స్నానముచేసినవారు యజ్ఞఫలమును పొందుదురు, తరువాత 'నైమిశకుంజ' యాత్రచేయవలెను. పూర్వము నైమిశారణ్యము నందలి మునులు తీర్థయాత్రకు పోయి కురుక్షేత్రమును చేరిరట. అప్పుడు వారు 'సరస్వతీకుంజ'మును నిర్మించిరట. (దానికే నైమిశకుంజము అనిపేరు. అది ఋషుల నివాస స్థానము) తరువాత 'కన్యా' తీర్థమును సేవించవలెను. పిదప 'బ్రహ్మ' తీర్థమునందు స్నానము చేయవలెను. అందులో అధమ వర్ణమువాడు స్నానముచేసి బ్రాహ్మణత్వమును పొందగలడు. బ్రాహ్మణుడు స్నానముచేసి విశుద్ధాత్ముడై ఉత్తమగతిని చేరగలడు. తరువాత 'సోమ' తీర్థమునందు స్నాతుడై సోమలోకమును పొందగలడు.

## మంకణక ముని చరిత్ర

"రాజా! ఆతరువాత తీర్థయాత్రికుడు 'సప్తసారస్వత' తీర్థమునకుపోయి అందు స్నానముచేసి సిద్ధుడు కావగును. పూర్వము మంకణక మహాముని యీలాగేచేసి సిద్ధిని పొందెను. ఆ సమాచారమును వినుము. పూర్వమొకప్పుడు మంకణకమహాముని చేతిలో కుశాగ్రము గ్రుచ్చుకొనెను. ఆగాయమునుండి శాకరసము (ఆకులపసరు) స్రవించుచుండెను. దానిని చూచి సంతసించి ఆ ముని నృత్యముచేసెను. అతని తేజస్సుచేత మోహితములైన స్థావర జంగమాదులు గూడ నృత్యముచేయసాగెను అప్పుడు బ్రహ్మాది దేవతలు, ఋషులు ఆ మంకణక ముని వృత్తాంతమును మహాదేవునకు తెలిపి, 'దేవా! ఈ ముని నృత్యముచేయకుండ నుండునట్లు ఏదైన ఉపాయమును చేయుడు.' అని ప్రార్థించిరి అప్పుడా దేవుడు దేవహితేచ్ఛచేత మంకణకముని కడకుపోయెను. ఆనందావేశముచేత నృత్యము చేయుచున్న ఆ మునితో మహాదేవుడు, 'మునీశ్వరా! నీ నృత్యమునకు కారణమేమి? యని యడిగెను. దానికాముని, బ్రాహ్మణా! నేను ధర్మ మార్గములో సంచరించుచున్నాను. నాచేతి నుండి శాకరసము స్రవించుచున్నది. దీనిని చూచి హర్షముచేత నృత్యము చేయుచున్నాను, అని మహాదేవునితో ననెను. అప్పుడా దేవుడు నవ్వి యామునితో, 'నేను ఇట్టిదానికై విస్మయమునుపొందను చూడుము,"అని తనబొటనవేలిని గాయపరచగా దానినుండి మంచు వంటితెల్లని భస్మమురాలెను. దానినిచూచి మంకణకుడు సిగ్గుపడి పరమ శివుని పాదములపైన పడి, "దేవా! నీవు రుద్రుడవు తప్ప వేరుకాదు. సమస్తజగత్తునకు సృష్టి–స్థితి–లయకారకుడవు. దేవతలు కూడ నిన్ను తెలిసికొనజాలరనగా నేనెంతటివాడను? నీవే జగత్కర్తవు. నా తపస్సు నశించకుండునట్లు అనుగ్రహింపుము "అని వేడుకొనెను. ఆ మాటకు దేవదేవుడు సంతసించి మునితో, "నీ తపస్సు సహస్రగుణముగా పెరుగుచుండునట్లు అనుగ్రహించితిని నీతో ఈ యాశ్రమమునందు నేనుగూడ నివసించెదను. ఎవడు ఈ సప్తసారస్వత తీర్థములో స్నానముచేసి నన్నుపూజించునో వానికి ఇహపరలోకములలో లభించని వస్తువులు ఉండవు "అని చెప్పిఅచటనే అంతర్ధానముచెందెను.

"రాజా! అచటినుండి 'ఔశనస'తీర్థమునకు పోవలెను. అక్కడ శుక్రాచార్యులయందలి ప్రీతిచేత సమస్త దేవతలు సన్నిహితులైయుందురు. అచటినుండి పోయి 'కపాలమోచన' తీర్థమును సేవించిన వారికి పాప విముక్తి కలుగును. తరువాత 'అగ్ని' తీర్థమునకు పోయి స్నానముచేసిన వారు అగ్నిలోకమునకుపోవుదురు.

స్వకులమును ఉద్ధరింతురు. "విశ్వామిత్ర" తీర్థములో స్నానము చేసిన సామాన్యమానవుడు బ్రాహ్మణుడగును. 'బ్రహ్మయోని' తీర్థములో స్నానము చేసినవాడు బ్రహ్మలోకమునకు పోవును. ఏడు తరములవరకు తన కులమును పావనముచేయును. ఆతరువాత కార్తికేయ దేవుని యొక్క 'పృథూదక' తీర్థమునకుపోయి స్నానము చేసిన స్త్రీ పురుషులు అజ్ఞానముచేతగాని, జ్ఞానముచేతగాని చేసిన దుష్కర్మలనుండి ముక్తులై పుణ్యలోకమునకు పోవుదురు. రాజా! అన్నిటికన్న శ్రేష్ఠము కురుక్షేత్రము. దానికన్న ఉత్తమము సరస్వతీనది. దాని కన్న పవిత్రములు ఆనదీ తీర్థములు. వానికన్న పుణ్యము పవిత్రమునైనది పృథూదకము. కనుక అందులో స్నానముచేసిన వారికి పునరావృత్తి రహితమై శాశ్వత పుణ్యలోకములు కలుగును.

రాజా! ఆ సమీపములోనే ఉన్న 'మధుస్రవ' తీర్థములో స్నానముచేసిన వారికి మహా పుణ్యము కలుగును. ఆ తరువాత 'సరస్వతీ-అరుణా సంగమ' తీర్థమునకు పోవలెను. అందులో స్నానము చేయుచు మూడు రాత్రులు ఉపవాసముతో నుండినవారు బ్రహ్మహత్యా దోషమునుండి విముక్తులగుదురు. అచ్చటనే 'అర్థకీల' తీర్థము ఉన్నది. దానిని 'దర్భి' యను ముని బ్రాహ్మణ హితార్థమై నిర్మించెను. దానిలో స్నానము చేసినవారు, సత్కర్మలు ఆచరించినను-ఆచరించకున్నను పుణ్యలోకములకు పోవుదురు. దర్భి మహాముని నాలుగు సముద్రములను ఒక చోట చేర్చెను. ఆ తీర్థమునందు స్నానము చేసినవారు దుర్గతిని పొందరు. ఆ తరువాత క్రమముగా "శతసహస్రక-సాహస్రక-రేణుకా-విమోచన-పంచవటీ-తైజస" తీర్థములను సేవించవలెను. తైజసమునందే పూర్వము కుమారస్వామికి దేవతలందరు దేవసేనాపతిగా నభిషేకము చేసిరి. దానికి తూర్పుగానున్న 'కురు' తీర్థమును, తరువాత క్రమముగా, "స్వర్గద్వార-అనరక" తీర్థములను సేవించవలెను. ఆ నరకమునందు దుర్గా-విశ్వేశ్వరుల మందిరములు గలవు. విష్ణుస్థానము గూడ కలదు. ఈ తీర్థములో స్నానముచేసి యీ దేవతలను కొలిచినవారు చంద్రసమాన తేజస్సు కలవారగుదురు.

"రాజా! తరువాత స్వస్తి పురమును సేవించి క్రమముగా పావన-గంగాహ్రద-స్థాణువట తీర్థములను సేవించి పాప విముక్తుడగును. అచటి నుండి 'బదరీపావన' మను వసిష్ఠాశ్రమమును దర్శించవలెను. అచ్చట మూడు రాత్రులు ఉపవాసముచేసి బదరీ (రేగు) ఫలమును భుజించవలెను. అచ్చట పన్నెండేండ్లు ఇట్లు తపస్సు చేయువాడు వసిష్ఠ సమానుడగును. అటనుండి యాత్రికుడు "రుద్రమార్గ"మను క్షేత్రమునకు పోవలెను. దాని సేవనముచేత స్వర్గ ప్రాప్తి కలుగును సూర్యాశ్రమమునకు పోయినవాడు సూర్య సమానుడగును. "దధీచ" తీర్థసేవనముచేసి సరస్వతీ లోకమునకు పోవగలడు. 'కన్యాశ్రమ'గమనము చేత కన్యాసహస్రమును పొందును. 'సన్నిహతీ'తీర్థమును సూర్యగ్రహణమున సేవించినవానికి ఇచ్ఛా పూర్తి యగును. ఈ తీర్థమునందు పృథివిలోని సర్వ తీర్థములు అమావాస్యయందు చేరును గనుక 'సన్నిహతి' యను పేరు దానికి వచ్చినది. దానిలో స్నానము చేయగనే పద్మ వర్ణముగల విమానములో బ్రహ్మలోకమునకు పోవును. తరువాత 'మచక్రుక' ద్వారపాలకునకు నమస్కరించి 'కోటి' తీర్థములో స్నానము చేయవలెను. పిదప 'గంగాహ్రద' తీర్థమును సేవించవలెను.

మానవులకు నైమిశమును, దేవతలకు పుష్కరమును, త్రిలోకవాసులకు కురుక్షేత్రమున్ను విశేష తీర్థములు. 'సరస్వతీ దృషద్వతీ' నదుల మధ్యనున్న కురుక్షేత్ర ప్రదేశమునందు నివసించు వారికి స్వర్గసుఖములభించును.'కురుక్షేత్రమునకు పోయెదను, కురుక్షేత్రమునందు వసించెదను' అని చెప్పువారికి సర్వ పాప విముక్తియు కలుగును. అది బ్రహ్మకు స్థానము. అచ్చటవసించు మానవులకు దుఃఖమే ఉండదు. నలువైపుల తరంతుక-అరంతుక తీర్థములకు-'రామహ్రద-మచక్రుక తీర్థములకు మధ్యగల దేశము కురుక్షేత్రమనబడును. ఇదియే కురుక్షేత్ర సమంత పంచములగును. ఈ దేశము బ్రహ్మదేవుని "ఉత్తరవేది" యనబడును. ఆ తర్వాత పులస్త్య మహాముని భీష్మునకు అనేక విధములైన పుణ్యతీర్థముల మహిమను ఇట్లు చెప్పదొడగెను.

"ధర్మదేవత తపస్సుచేసినచోట తనపేరవే నిర్మించిన 'ధర్మ' తీర్థమునందు స్నానముచేసిన తీర్థయాత్రికులు ధర్మశీలురై తమ కులములో ఏడు తరములను ఉద్ధరింతురు. ఆతరువాత జ్ఞాన పావన తీర్థ - సౌగంధిక వన- (రావిచెట్టునుండి పుట్టిన) సరస్వతీ నదీ - ఈశానాధ్యుషిత. తీర్థములను సేవించవలెను. సరస్వతీ సమీపమున వల్మీకమునుండి స్రవించిన జలమునందు స్నానముచేయవలెను. ఈ జలమునుండి ఆరు 'శమ్యానిపాతముల' (శమ్యా అనగా దండము. బలవంతుడు కఱ్ఱను విసరివేసినచో ఎంత దూరము అది పడునో ఆ దూరమునకు 'శమ్యానిపాతము' అనిపేరు. అట్టి ఆరు శమ్యానిపాతముల) దూరములో 'ఈశానాధ్యుషిత' తీర్థముగలదు. దానిలో స్నానముచేసిన వారికి వేయి కపిలా గోవులను దానముచేసిన ఫలముకలుగును.

"అచటినుండి వరుసగా, 'సుగంధా-శతకుంభా-పంచయజ్ఞా-త్రిశూలఖాత-(శాకంభరీ అని ప్రసిద్ధి నందిన) దేవీస్థాన' తీర్థములను సేవించవలెను. దేవీ స్థానమునందు, దేవి వేయి సంవత్సరములు శాకములను తినుచు ఉత్తమ తపస్సును చేసెను. ఆమె భక్తిచేత ప్రభావితులై అనేక మహర్షులు అచటికి రాగా ఆమె వారికిగూడ శాకములతో ఆతిథ్యమిచ్చెను. గనుక ఆ దేవీ స్థానమునకు 'శాకంభరీ' అని పేరువచ్చినది. అచటినుండి 'సువర్ణ' తీర్థమునకు పోవలెను. అచట విష్ణుదేవుడు రుద్రదేవుని ఆరాధించి వరములను బడసెను. రుద్రుడు ప్రసన్నుడై విష్ణువునకు ఈ స్థలముననే వరములనిచ్చి యితనితో 'కృష్ణా! నీవు లోకములో అందరికి ప్రియుడవయ్యెదవు. ప్రపంచములో నీకు ప్రాధాన్యము వచ్చును.' యని చెప్పెను. కనుక రాజేంద్రా! ఈ తీర్థములో శంకరుని పూజించవలెను."

"అచటినుండి 'ధూమావతీ- రథావర్త- ధారా' తీర్థములను సేవించి 'ధార'నుండి హిమాలయమునకు నమస్కరించి 'గంగాద్వార' (హరిద్వార) యాత్రచేయవలెను. అచటి కోటి తీర్థము నందు స్నానముచేయవలెను. అచటనున్న 'సప్త గంగ-త్రిగంగ-శక్రావర్త- కనఖల-కపిలావట (నాగరాజగు కపిలుని తీర్థము)-

లలితక (ఇది శంతను తీర్థము) - గంగాయమునామధ్య తీర్థములను సేవించినవారు అనేక పుణ్య ఫలములను పొంద గలరు అచటినుండి, 'సుగంధా-రుద్రావర్త- గంగా సరస్వతీ సంగమ- భద్రకర్ణేశ్వర- కుబ్జామ్రక- అరుంధతీవట- సాముద్రక- బ్రహ్మావర్త - యమునా ప్రభవ-ధర్వీ సంక్రమణ- సింధు ప్రభవ- దేవీతీర్థ'- ఋషీ కుల్యా- వాసిష్ఠ' తీర్థములను సేవించవలెను. వాసిష్ఠమును సేవించిన వారందరు బ్రాహ్మణులగుదురు. అచటి నుండి 'భృగుతుంగ-వీర ప్రమోక్ష- కృత్తికా- మఘా- విద్యా- మహాశ్రమ- మహాలయ' తీర్థములందు స్నానముచేసినవారు అనేక గోదాన, అశ్వమేధాది ఫలములను పొందెదరు. మహాలయ తీర్థమునందు స్నానముచేసిన తనకు పూర్వము పది తరముల వారిని, తన తరువాత పది తరములవారిని ఉద్ధరించగలరు.

"ఆ తరువాత 'వేతసికా-సుందరికా- బ్రాహ్మణీ- నైమిశ' తీర్థములను సేవించవలెను. నైమిశమును వెతకుచు పోయినంత మాత్రమున సగము పాపము నశించును. అచట ప్రవేశించిన తోడనే సమస్త పాపము నశించును. పృథివిలోనున్న తీర్థము లన్నియు నైమిశమునందు కలవు దానిని సేవించినవానికి గోమేధ ఫలము కలిగి ఏడు తరములవారిని అతడు ఉద్ధరించును. ఎల్లప్పటికి పవిత్రము, పుణ్యము నైన నైమిశ క్షేత్రమునందు మరణించినవారు సర్వ లోకములందు సంతసమును పొందుదురు. అచటి నుండి 'గంగోద్భద- సరస్వతీ- బాహుదా- క్షీరవతీ-విమలాశోక- (సరయూ సమీపమునందలి) గోప్రతార' తీర్థములను సేవించవలెను పూర్వము రాముడు గోప్రతార తీర్థమునకు పోయి దానిని సేవించి సపరివారముగా స్వర్గమునకు పోయెను. కనుక సరయూ నదిలోని గోప్రతార తీర్థమునందు స్నానముచేసినవారు స్వర్గ సుఖమును అనుభవించెదరు.

"ఆ తరువాత గోమతీ నదిలోని 'రామతీర్థము'ను సేవించవలెను పిదప వరుసగా 'శత సాహస్ర- భర్తృస్థాన- కోటితీర్థ- వారాణసీ (కాశీ) - కపిలాహ్రద- అవిముక్త' క్షేత్రములను దర్శించి సేవించవలెను అవిముక్తమునందలి దేవ దేవుని ఉపాసించినవారు బ్రహ్మహత్యా పాపమునుండి విముక్తులగుదురు అచట మరణించినవారు అవశ్యముగా మోక్షమును పొందెదరు. తరువాత 'మార్కండేయ- గంగా గోమతీ సంగమ-గయా' క్షేత్రములను సేవించవలెను. గయలో 'అక్షయవటము' అను పెద్ద మఱ్ఱిచెట్టు కలదు. దానిక్రింద పితృదేవతలను పూజించిన వారికై ఇచ్చిన వస్తువులు అక్షయములై వారికి సద్గతిని కలిగించును. అచటి మహానదీ- బ్రహ్మసరస్సు'లలో స్నానముచేసి బ్రహ్మలోక ప్రాప్తి ఫలము పొందును. ఆ సరస్సునందు బ్రహ్మదేవుడు స్థాపించినయూపము (యజ్ఞాదులలో నాటబడిన స్తంభము) ప్రదక్షిణము చేసినచో వాజపేయ ఫలము లభించును.

"రాజేంద్రా! తరువాత 'ధేనుక' తీర్థములో స్నానము చేయవలెను. గోవు ప్రమాణము తిలలను దానము చేయవలెను. అట్టివారు పాప విముక్తులై సోమలోకమును చేరుదురు. అచట దూడతో గూడ నొక గోవు పర్వతముపైన సంచరించుచున్నట్లు అడుగుల గురుతులు ఇప్పటికిని కనపడుచుండును. వానిని స్పృశించినవారు చేసిన పాపములన్నియు నశించును. 'గృధ్రవట' క్షేత్రమునకు పోయి భగవంతుడగు శంకరుని సన్నిధిలో భస్మ స్నానముచేసిన వారి పాపములు నశించును. 'ఉదయగిరి' క్షేత్రములో 'గాయిత్రీ'దేవి యొక్క చరణ చిహ్నములు నేటికిని కనపడును. వాని సన్నిధిలో సంధ్యోపాసన చేసినవారికి పన్నెండేండ్లు సంధ్యవార్చిన ఫలము లభించును. అచటనే ఉన్న 'యోనిద్వార' తీర్థమును సేవించిన వారికి పునర్జన్మ కలుగదు. ఒక నెల పూర్తిగా గయాక్షేత్రములో నివసించినవారు ఏడు తరములవారిని పాపమునుండి ఉద్ధరించెదరు. అనేక పుత్రులు కలుగవలెనని కోరుదురు. ఎందుకనగా, వారిలో నొకడైనను గయా క్షేత్రమునకు పోవునో లేక అశ్వమేధము చేయునో లేక నల్లని ఆబోతును విడుచునో (వృషోత్సర్జనము) యని పురుషులు ఆశించెదరు.

"రాజా! ఆ తరువాత 'ఫల్గు' (ఫల్గునీనది) తీర్థమును సేవించి 'ధర్మ ప్రస' తీర్థ సేవనమునకు పోవలెను. అచట నొక నూతిని త్రవ్వి ఆ నీటిలో స్నానముచేసి పితృదేవతలను ఆరాధించినవారు పాప విముక్తులై స్వర్గమునకు పోయెదరు. అచటనే 'మతంగ' మహాముని యాశ్రమము గలదు, దానిని సేవించినవారు అశ్వమేధ ఫలమును పొందెదరు, అచటినుండి, 'బ్రహ్మస్థాన- రాజగృహ' క్షేత్రములను సేవించవలెను. రాజగృహమునందు స్నానముచేసి అచటి యక్షిణీదేవతకు నివేదించిన ఆహారమును భుజించినచో ఆ దేవి యనుగ్రహముచేత బ్రహ్మహత్యా దోషమునుండి విముక్తుడగును అటనుండి 'మణినాగ' క్షేత్రమును సేవించి అచటి నాగదేవుని తీర్థ ప్రసాదములు సేవించినవారికిని పాము విషము బాధించదు. అచటినుండి బ్రహ్మర్షియైన 'గౌతమ' ముని యాశ్రమమునకు పోయి యచటి 'అహల్యా' తీర్థమునందలి 'ఉదపాన' తీర్థమునందు స్నానము చేసినవారు త్రిలోకముల యందు సుప్రసిద్ధులై అశ్వమేధయాగ ఫలమును పొందెదరు.

(సశేషం)

# గుంటూరు జిల్లాలో కొత్త పరిశ్రమలకు అవకాశాలు

> రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో కొత్తగా పరిశ్రమలు నెలకొల్పడానికి ఎన్నో అవకాశాలు వున్నాయి. జిల్లావారీగా నెలనెలా యీ వివరాలు ప్రకటిస్తాం. వచ్చే నెలలో కర్నూలుజిల్లా గురించి. (సం)

## వాటర్ ప్రూఫ్ ప్యాకింగ్ పేపరు

ఈ జిల్లాలో పొగాకు ఎగుమతి దారులకు వాటర్ ప్రూఫ్ ప్యాకింగ్ కాగితం (మైనం కాగితం) ఎక్కువ మొత్తంలో కావలసి ఉంటుంది. 1968లో రు. 6 5 లక్షల విలువ గల యిటువంటి కాగితాన్ని వినియోగించారు. కలకత్తా, మద్రాసులనుండి కూడా అర్డర్లను పొందడం జరిగింది. వాటర్ ప్రూఫ్ కాగితం తయారీకి యీ జిల్లాలో కనీసం రెండు యూనిట్లను నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## క్రిమి సంహారక స్ప్రేయర్లు

జిల్లాలో తెగుళ్ల నివారణ నిమిత్తం క్రిమిసంహారక స్ప్రేయర్లకు మంచి గిరాకీ ఉంది. జిల్లాలో వార్షికంగా రు1.5 లక్షల విలువ గల స్ప్రేయర్ల అవసరం ఉంది. వాటి ఉత్పత్తికి యిక్కడ కనీసం ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## పెయింటింగ్ బ్రష్‌లు

ఈ జిల్లాలో పెయింటింగ్ బ్రష్‌లు తయారుచేయడానికి ఒక్క పరిశ్రమకూడా ప్రస్తుతంలేదు. వార్షికంగా రు 1,00 లక్ష విలువచేసే బ్రష్‌లు వినియోగిస్తున్నారు. ఈ జిల్లాలో ఒక యూనిటును నెలకొల్పవచ్చునని సిఫార్సు చేశారు.

## ట్రంక్ క్లిప్పులు

ఉక్కుపెట్టెలు, బియ్యం డబ్బాలు, రెగ్జిన్ బ్యాగులు మొదలైన వాటిని తయారుచేసే పరిశ్రమలలో ట్రంకు క్లిప్పులకు మంచి గిరాకీ ఉంది. ఈ జిల్లాలో 1963లో రు. 60,000/-ల విలువ గల ట్రంక్ క్లిప్పులను వినియోగించారు. ఈ వస్తువులను తయారుచేసే యూనిట్లు రాష్ట్రంలో లేవు. ఈ జిల్లాలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## హార్డ్‌వేర్ బిల్డర్స్ (అల్యూమినియం)

త్రుప్పు పట్టుట, అరుగుదలలను అల్యూమినియంతో తయారైన హార్డ్‌వేర్ బిల్డర్ల ద్వారా నివారించవచ్చు. బిల్డింగ్ కలర్ స్కీమ్‌ను అనుసరించి అనువైన రంగులలో వాటిని తయారు చేయవచ్చు. ఇతడి, ఎం. ఎస్. హార్డ్‌వేర్ ఉత్పత్తులతో సమంగా యీ హార్డ్‌వేర్ వస్తువులుకూడా మన్నికగాను పటిష్టంగాను ఉంటాయి. ఈ వస్తువులకు మంచి గిరాకీ ఉన్న దృష్ట్యా ఒక యూనిటును నెలకొల్ప వచ్చు.

## కాగితపు సంచులు, కవర్లు

వ్యాపార, వాణిజ్య సంస్థలు. విస్తృతంగా వినియోగిస్తున్న దృష్ట్యా కాగితం సంచులు, కవర్లకు యిక్కడ బాగా గిరాకీ ఉంది. గుంటూరు జిల్లాలో 1963లో రు. 90,000/- విలువచేసే కాగితపు సంచులు, కవర్లు వినియోగించారు. వీటిని తయారుచేసే పద్ధతులు అంత క్లిష్టమైనవికావు. యీ జిల్లాలో యిటువంటి పరిశ్రమను లాభసాటిగా నిర్వహించవచ్చు.

## యంత్రాలతో పాదరక్షల తయారీ

గుంటూరు జిల్లాలో యంత్రాలతో పాదరక్షలు తయారుచేసే యూనిటులేదు. ఎక్కువ ఖరీదుగల పాదరక్షలు, వివిధ రకాల శాండల్స్ మొదలైన వాటిని జిల్లా అవలి ప్రాంతాల నుండి తెస్తున్నారు. 1963లో రు 2.5 లక్షల విలువచేసే విదేశీ రకాల పాదరక్షలను యీ జిల్లాలో ఉపయోగించారు ఈ జిల్లాలో యిటువంటి పరిశ్రమను నెలకొల్పవచ్చు.

## అల్యూమినియం వస్తువులు

ఈ జిల్లాలో అల్యూమినియంతో తయారుచేసిన సబ్బుపెట్టెలు, అష్ట్రేలు, కోటు హ్యాంగర్లు, మొదలైనవాటికి మంచి గిరాకీఉంది. ప్రస్తుతం రాష్ట్రంలో అటువంటి వస్తువులు తయారుచేసే

పరిశ్రమలు లేవు. గుంటూరు జిల్లాలో వార్షికంగా రు45,000/-లు విలువచేసే వస్తువులను ఉపయోగిస్తున్నారు. యీ జిల్లాలో యిటువంటి వస్తువుల తయారీకి ఒక యూనిటును నెలకొల్పవచ్చు

## ప్రింటింగ్ సిరా

జిల్లాలో అనేక ప్రింటింగ్ ప్రెస్‌లు ఉన్న కారణంగా సిరాకు మంచి గిరాకీఉంది. ఈ జిల్లాలో 1963లో రు. 80,000/-లు విలువచేసే ప్రింటింగ్‌సిరా వినియోగించబడింది.

రాష్ట్రంలో అవసరమైన ప్రింటింగ్ సిరాను దేశంలోని యితర ప్రాంతాల నుండి దిగుమతి చేసుకుంటున్నారు. జిల్లాలో యీ పరిశ్రమ అభివృద్ధికి మంచి అవకాశాలున్నాయి.

## నికోటిన్ సల్ఫేటు

పనికిరాని పొగాకునుండి లభించే నికోటిన్ సల్ఫేటు క్రిమి సంహారక ఔషధంగా బాగా ఉపయోగపడుతుంది. మిరప, వేరు శనగ పైర్లకు వచ్చే తెగుళ్ళను నివారించడానికి యిది ప్రత్యేకంగా ఉపయోగపడుతుంది. దీనికి అవసరమైన ముఖ్యమైన ముడిసరుకు జిల్లాలో పుష్కలంగా లభిస్తుంది. నికోటిన్ సల్ఫేటును తయారు చేసే విధానాన్ని రూపొందించారు. ఆసక్తి గలవారు యీ విధానాన్ని కొత్త ఢిల్లీ, లిట్టన్ రోడ్డులోని మండీహౌస్‌లో ఉన్న జాతీయ పారిశ్రామిక పరిశోధన అభివృద్ధి, కార్పొరేషన్ నుండి పొందవచ్చు

## పొటాషియం క్లోరైడ్, మెగ్నీషియం సల్ఫేటు

పొటాషియం క్లోరైడ్ అనేది ఒక రసాయనిక ఎరువు. మెగ్నీషియం సల్ఫేటును వివిధ పరిశ్రమలలో ఉపయోగిస్తారు.

సముద్రంలో లభించే మొక్కలతో వాటిని ఉత్పత్తి చేయవచ్చు. జిల్లాలో వార్షికంగా 2000 టన్నుల పొటాషియం క్లోరేడును ఉపయోగిస్తున్నారు. జిల్లాలో యీ వస్తువులకు మంచి గిరాకీ ఉండడం, ముడిసరుకు బాగా లభించడం దృష్ట్యా యీ పరిశ్రమను యిక్కడ నెలకొల్పడానికి మంచి అవకాశాలున్నాయి.

## సిగార్స్

ఆంధ్రప్రదేశ్‌లో డిండిగల్ రకం సిగార్లను తయారు చేయటంలేదు. రాష్ట్రంలో వీటికి మంచి గిరాకీ ఉంది. జిల్లాలో లభించే పొగాకు దీనికి ముఖ్యమైన ముడిసరకు, జిల్లాలో యీ పరిశ్రమను నెలకొల్పవచ్చు.

## మిర్చీనుండి ఒలియరెసిన్ అనే ద్రవం తయారీ

ఒలియరెసిన్ అనే ద్రవాన్ని మిర్చీనుండి తయారుచేస్తారు. మిర్చీలో ఉండే రుచి యితర శ్రేష్ఠతలు యీ ద్రవంలో లభిస్తాయి.

మిర్చీలకు బదులుగా యీ ద్రవాన్ని ఉపయోగించవచ్చు. ఇది దేశంలోనే ఒక కొత్త పదార్థం. ఈ జిల్లాలో ప్రారంభంలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు. మైసూరులోని కేంద్ర ఆహార పదార్థాల పరిశోధనా సంస్థనుండి అవసరమైన సాంకేతిక వివరాలను పొందవచ్చు

## అత్తిపండు ఉత్పత్తులు

జీడి మామిడి పరిశ్రమలో అనుబంధ ఉత్పత్తి అయిన అత్తిపండు ఉత్పత్తులను పానీయం, పండ్ల రసాలు, కేండీ మొదలైన వాటి తయారీలో వినియోగిస్తారు.

మార్కెటులో డబ్బాలలో భద్రపరచిన అత్తి పండ్లు డబ్బాలలోని యితర పండ్ల ఉత్పత్తులకన్నా చౌక.

ముడిసరుకు లభించే వేటపాలెంలో యీ పరిశ్రమకు చెందిన ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

---


# ఏజంట్లు కావాలి

## "ఆంధ్రప్రదేశ్" మాసపత్రిక

*(తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు)*

**సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ యీ మాసపత్రికను ప్రచురిస్తున్నది. అన్ని పట్టణాలు, నగరాలలో యీ పత్రిక విక్రయానికి ఏజంట్లు కావాలి.**

నియమ నిబంధనలకు ఇతర వివరాలకు :

హైదరాబాదు, మొజంజాహి రోడ్డులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ డైరెక్టరుకు వ్రాయండి.

మీరు

# కొత్త 1969 నార్టన్

## సైకిలును చూచేరా

## ?




## అది చూచుటకు ఎంతో ముచ్చటవేస్తూ ఉంటుంది!

అవును ! క్రొత్త నార్టన్‌కు ఆశ్చర్యకరమైన పరిక్రొత్త అంశములు ఉండుట వలన దానిని చూడగానే మీరు కొనాలనుకొంటారు. అది భారతదేశములో సైకిళ్లను తయారుచేయుటలో మార్గదర్శకులైన వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది !

**హింద్ సైకిల్స్ లిమిటెడ్,**
**250, వర్లి, బొంబాయి-25 డిడి.**
భారతదేశములో పూర్తి సైకిలును తయారుచేసే దాం పెద్ద సంస్థ. అన్ని విడి భాగములను ఒకే చోట తయారుచేస్తోంది.




BAS-HC 25 TEL

## ఏ విధముగా చూచినా ఎంతో మంచి సైకిలు-నార్టన్

# తెలంగాణా భూములకు నాగార్జున సాగర్ జలాలు

1970 జనవరి 16 వ తేదీన నాగార్జునసాగర్ చరిత్రలో మరొక చరిత్రాత్మక ఘట్టం ప్రారంభమయింది. ఆనాడు 44 వేల హెక్టార్ల భూమికి—అంటే లక్ష పదివేల ఎకరాలకు అదనంగా సేద్యపు నీటి పారుదల సౌకర్యం కలిగింది. ఈ ప్రాంతం 11,12,13 బ్లాకులకు సంబంధించినట్టిది. నల్లగొండ జిల్లా హుజూర్‌నగర్ తాలూకాలోని తొమ్మిది గ్రామాలకూ, కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని ఆరుగ్రామాలకూ దీనివల్ల లాభం కలుగుతుంది. 1970 జూలై నెలలో యింకా అదనంగా 7,700 హెక్టార్ల భూమికి నీరు లభిస్తుంది.

1970 జనవరి 16 వ తేదీన కోదాడదగ్గిర మునగాల వద్ద జరిగినసభలో రెవెన్యూమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, నీటిని విడుదల చేశారు. ఈ సమయంలో పొలాలకు నీరు విడువడంలో ఎంతో ప్రాధాన్యంవుంది. ఎందుకంటే, రాష్ట్రంలో పంటల పండుగ ఆయిన సంక్రాతి సందర్భంగా యీకార్యక్రమం జరిగింది.

లాల్‌బహదుర్ కాలువ (ఎడమ కాలువ)కు ఇంతవరకు త్రవ్విన ఉపకాలువలలో ముక్త్యాల కాలవ పెద్దది. దీనిపొడవు 29 కి.మీ. దీనిలో సెకెండుకు 50 ఘ.మీ. నీరు ప్రవహిస్తుంది ఈ ఉపకాలువ వల్ల సుమారు 44 వేల హెక్టార్ల భూమికి నీరు లభిస్తుంది. ఈ కాలవమీద మొత్తం 63 నిర్మాణాలు వున్నాయి. ఇందులో 8 భూగర్భ సొరంగాలు, ఒక సూపర్ ప్యాసేజి, 6 బండ్ల వంతెనలు, 3 రోడ్డు వంతెనలు, 8 డ్రాపులు, 33 ఆఫ్‌టేక్ స్లూయిస్‌లు, 4 రెగ్యులేటర్లూ వున్నాయి.

11, 12, 13 బ్లాకుల నిర్వహణలో జరిగిన పనుల వివరాలు

| బ్లాకునెం. | నీటిపారుదల కాల్వలపొడవు | పంటకాల్వల పొడవు |
|---|---|---|
| 11 | 31 కి. మీ | 37 కి.మీ. |
| 12 | 26 కి.మీ. | 66 కి మీ. |
| 13 | 450 కి.మీ. | 1040 కి.మీ. |

ఆయకట్టు త్వరగా అభివృద్ధి పరచడానికై ప్రారంభ చర్యగా పి. డబ్ల్యు.డి. శాఖవారే పంటకాల్వల త్రవ్వకంపనులు చేశారు. మామూలుగా నైతే రైతులే యీ పంటల కాల్వల పని చేసుకోవలసివుండేది.

భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 1967 ఆగస్టు 4న నాగార్జునసాగరు కాలువలకు ప్రారంభోత్సవం జరిపారు. సుమారు 35 లక్షల ఎకరాలకు నీటిపారుదల చేసేవిధంగా ఈ కాలువలను రూపొందించారు. ఈ కాలువల నిర్మాణానికి ఇంజనీరింగు సర్వే పనులు, భూసారపరిశీలనలు, వ్యవసాయ ఆర్థిక వివరాల సేకరణ, ఆర్థిక సాంఘిక, భోగట్టా పండేపంటలవివరాలు పంటకాలవత్రవ్వకం పనులు మున్నగు అభివృద్ధి పనులకు సంబంధించిన కార్యక్రమాలను జాగ్రత్తగా పరిశీలించి సమన్వయ పరచడం జరిగింది. అనకట్ట, ముఖ్యకాలవ నిర్మాణ కార్యక్రమాలకు అనుగుణంగానే పిల్లకాలవలు పంటకాలవల పని పూర్తి చేయడం జరిగింది.

తెలంగాణా ప్రాంతంలో లాల్‌బహదుర్ కాలువ క్రింద ఆయకట్టు అభివృద్ధి శ్లాఘనీయంగా జరిగింది. 1967 జూన్ నాటికి నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం తాలూకాలో 1 నుంచి 6 బ్లాకుల వరకు 96 గ్రామాలలో 36 000 హెక్టార్ల (90,000 ఎకరాల) భూమికి నీటిపారుదల సౌకర్యాలుకల్పించడం జరిగింది. 1968 జూలై నాటికి నల్గొండ జిల్లాలోని హుజూరునగరు,



ముక్త్యాల బ్రాంచికాలువలో నీరువిడుదల (జనవరి 16)



48—8







లో మరొక 8100 హెక్టార్ల (20,000 ఎకరాలు) బీడుభూములు 7,8,9 ...గం సేద్యం కిందికివచ్చాయి. ఈ విధంగా 1968 నవంబరు నాటికి ...,000 ఎకరాలకు కృష్ణానది జలాలు పారుదల అయ్యాయి. నీటి పారుదల ...మంగా జరిగింది. గడిచిన ఖరీఫ్ పంట కాలంలో సుమారు 55 వేల ... అభివృద్ధి పరిచారు.

### ...నవరి 16 వ తేదీన

హుజూర్‌నగర్ తాలూకాలో 9 గ్రామాలకు కృష్ణాజిల్లా నందిగామ ...గ్రామాలకు చెందిన మరో 54 వేల హెక్టార్ల భూమికి సేద్యపు నీరు

నే నాగార్జునసాగర్ ప్రాజెక్టు తన జలాలతో బీడుభూములను సైతం





# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

సత్యం చిత్రకళా ప్రదర్శనకు కేశవరావుగారూ, వాళ్ళ అమ్మాయి విమలా వచ్చారు. చిన్ననాటి గురువుగారయిన కేశవరావుగారికి శాంతినికేతన్ విషయాలూ, స్వవిషయాలూ తెలియజేశాడు సత్యం. సత్యం మిత్రుడు మాధవరావుకు విమలతో పరిచయమైంది. ఒకరోజు కారులో వాళ్ళిద్దరూ హోటల్‌కువెళ్ళి కాఫీ తీసికొన్నారు మాధవరావు మనస్సులోని విషయాన్ని విమలకు చెప్పడానికి ప్రయత్నించాడు. కాని మరోసారి వింటానని విమల చెప్పింది. ఇద్దరూ తిరిగి ఇంటికి వచ్చారు. మాధవరావుకు తల నొప్పిగా వున్నప్పటికి సత్యం, కేశవరావు, రాజమణీదేవిలను డ్రామాకు తీసికొనిపోయాడు

రెండు రోజులుగా ఒకటే ముసురు. అడుగు బయటపెట్టాలంటే విసుగు పుట్టేలా వుంది. పైగా ఈదురు గాలి ఒకటి.

విమల వరండాలో కూర్చొని చెదురు మదురుగా పడుతున్న వర్షపు జల్లుల్ని పరికిస్తూంది.

ఇంటి ముందున్న చెట్లు, మొక్కలు, వర్షంలో తడిసి వింత భావాన్ని వెల్లడిస్తూన్నాయి.

ఎదురుగా వాకిటి ముందున్న ఎర్ర గులాబీ మొక్క విరగ బూసి, గంపెడు బిడ్డల్ని కన్న తల్లిలా నిండుగా, గర్వంగా కన్పిస్తోంది.

వర్షంలో తడసిన గులాబీ పుష్పాలు, అంతవరకూ గుక్క పట్టి ఏడ్చి. తల్లిని చూడగానే బోసి నవ్వుల్ని వెదజల్లే పసి పాపల పసిడి బుగ్గల్ని జ్ఞాపకం చేస్తున్నాయి.

ఆకాశం, ప్రసవంఅనంతరం వేదననుంచి విముక్తి చెంది అలసి నిద్రిస్తున్న బాలింత ముఖంలా ప్రశాంతంగా పేలవంగా వుంది.

విమల ఆకాశంకేసి చూసింది. ఆకాశంలో విచ్చిపోతున్న మేఘాలు ఆమె మనో ఆకాశాన్ని చుట్టివేస్తున్నాయి.

తెరిచివున్న మేఘ సందేశం కావ్యం ఆమె ఒడిలోవుంది.

విమలకు ఏడవాలనిపిస్తుంది. కాని ఏడుపు రావటంలేదు. ఏదో చెప్పనలవికాని బాధ ఆమె గుండెల్ని పిండుతోంది.

వర్షించబోయేముందు మేఘాలు పడే బాధ ఉరుముల్లో మెరుపుల్లో వ్యక్తం అవుతుంది.

కన్నీటి రూపంలో కరిగి వర్షిస్తేగాని తన హృదయాకాశాన్ని అలుముకున్న విషాద మేఘాలు విడిచిపోవు.

ఏమిటీ కలవరం? ఎందుకీ ఆవేదనా? దేనికోసం ఈ తపన! ఎవరి కోసం ఈ ఆరాటం! తనలో ఆరని ఆర్తి ఎందుకు ప్రజ్వలిస్తోంది?.

ఇది నిజమేనా? ఇదంతా సత్యం కోసమేనా ? అవును! సత్యం! సత్యానికి తన ఆత్మను ఏనాడో అర్పించుకుంది. ఆ ఆరాధన ఈనాటిదికాదు.

ఆరాధనకు అర్థం తెలియని వయస్సులో తనలో సత్యాన్ని ఆరాధించింది.

నిజంగా విధివిలాసం! తను వివాహానికి విముఖంగా వుండటం తన భర్త ఎలావుంటాడో కూడా సరిగా చూడకుండానే చనిపోవటం...... అదంటూ ఏదో కలలోలా తన కనిపిస్తూవుంటుంది.

తను వివాహిత అనేభావం తనకు కావాలన్నా రావడంలేదు.

ఒకవేళ సత్యం తను వివాహిత అని దూరంగా వుంటున్నాడేమో !

విమల మనస్సులో ఏదో లోతుగా గుచ్చుకున్నట్లయింది.

అలా కానేకాదు. సత్యం అంత మూఢ నమ్మకాలుకల వ్యక్తి కాదు. తన భర్త వివాహం అయిన కొద్ది గంటల్లోనే శాశ్వితంగా వెళ్ళిపోయాడని తెలియదా?

రాజమణీదేవిలాంటి ఆచార పరాయణురాలే పొరపాటున కూడా తను వితంతువు అనే భావం కలుగనీయకుండా ప్రవర్తిస్తోందే! మాధవరావుకు అసలు ఆ తలంపే వున్నట్లు వుండదు. తనను ఓ అవివాహితలాగే చూస్తాడు,

మాధవరావు! ఆతన్ని తల్చుకుంటేనే జాలి వేస్తుంది. అంత నవ్వుతో నవ్విస్తూ, బోళాగా కన్పించే మాధవరావు ఎంత గాంభీర్యంగా వుంటున్నాడో ఆ మధ్య!

ప్రేమ మనిషికి నిండు తనాన్ని ఇస్తుందా! గాంభీర్యాన్ని ఇస్తుందా!

అవును మాధవరావు తనను ప్రేమిస్తున్నాడు. ఆనాడు అతనికి తను మాట్లాడే అవకాశాన్ని కూడా కల్గించలేదు. ఎంత బాధ పడ్డాడో! మరి తను బాధ పడడంలేదూ సత్యం తనను నిర్లక్ష్యం చేస్తున్నాడని!

తనకు సత్యం కావాలి. సత్యానికి సరళ కావాలి. మాధవ రావుకు తను కావాలి!

ప్రేమ చిత్రమయింది. సాధారణంగా ఏదో అడ్డంకువున్న చోటునే వెతుక్కుంటుంది.

రాజమణీదేవి తనను చూడందే ఒక్కరోజు కూడా వుండ లేదు. ఏనాటిదో ఈ అనుబంధం!

ఆమె ప్రాణాలన్నీ మాధవరావు మీద పెట్టుకొని బ్రతుకు తోంది. అతని వివాహం గురించి అహర్నిశలు బాధ పడుతూ వుంటుంది. మాధవరావు తనను ప్రేమిస్తున్నాడని రాజమణీదేవికి తెలిస్తే!

ఆమె తనను కూతురిలా ఆదరిస్తుంది. ఇంటి కోడలిగా, వంశోద్ధారకుడికి తల్లిగా స్వీకరించగలదా? తను వితంతువు. పైగా వర్ణ భేదం ఒకటి.

ఆమెకు ఈ విషయం తెలిస్తే తనను ఇంతగా ఆదరించ గలదా?

మాధవరావుకు ఏలా నచ్చ జెప్పడం! సత్యం ద్వారా చెప్పిస్తే!

సత్యానికి కన్పించని ఏ అందం తనలో మాధవరావుకు కన్పిస్తుందో! మాధవ్ ఐశ్వర్యవంతుడు 'ఓ!' అనాలే గాని కోటి మంది ఆడపిల్లలు అతని ముందు మోకరిల్లటానికి సిద్ధంగా వున్నారు

అతని మనస్సును చూరగొనే ప్రయత్నంలో అతని చుట్టు తిరిగే ఆడపిల్లల్లో లేని ప్రత్యేకత తనలో ఏం ఉంది?

అందుకే అంటారేమో! తాను మెచ్చింది రంభ తాను మునిగింది గంగ! అని!

మాధవరావంటే తనకూ ఇష్టమే! కాని సత్యంమీద వున్న ఇష్టం లాంటిదికాదు.

వాకిటి ముందు కారు ఆగిన శబ్దం అయింది. సరళ తన ఆలోచనలనుంచి బయటపడింది.

డ్రైవర్ చినుకుల్ని తప్పించుకుంటూ రెండంగల్లో విమల ముందుకొచ్చి నిల్చున్నాడు.

"ఏం! యాదయ్యా! అమ్మగారు కులాసాగా వున్నారా?"

"రెండు రోజులుగా అమ్మగారికి జ్వరం వస్తుందమ్మా! ఇవ్వాళే కొంచెం తగ్గిందట. మిమ్మల్ని తీసుకొని రమ్మన్నారు." విమల ప్రశ్నకు జవాబిచ్చాడు యాదయ్య.

విమల మనస్సు నొచ్చుకుంది. రెండు రోజులుగా జ్వరం అయినా తనువెళ్ళి చూడలేకపోయింది! అమ్మకు తనంటే ఎంత ప్రేమో!

కన్న తల్లిని కూడా మరిపించే ప్రేమ ఆమెది!

ఆమెకు ఒక్కగానొక్క కొడుకు మాధవ్. అతని చుట్టూనే ఆమె తన ఆశల్నీ ఆశయాల్నీ అల్లుకుంటూ ఉంది.

అలాంటి మాధవరావు మనస్సు తనవల్ల బాధపడుతోంది.

ఆ సంగతి తెలిస్తే! రాజమణీదేవికి తను ముఖం ఎలా చూపించగలదు?

విమల కళ్ళలో నీరు తిరిగింది.

విమల లేచి ఇంట్లోకి వెళ్ళింది. డ్రైవర్ ఆశ్చర్యంతో లోపలకు వెళుతున్న విమల్ని చూస్తూ నిలబడిపోయాడు.

కేశవరావు తను చదువుతున్న పుస్తకంపైనుంచి చూపు మరలించి అప్పుడే గదిలోకి ప్రవేశించిన కూతురివైపు చూశాడు.

"రాజమణీదేవి ఆరోగ్యం సరిగా లేదట. కారు పంపిం చారు. మీరు వస్తారా చూసి వద్దాం!"

"నాకు ఇవ్వాళ పొద్దుటినుంచీ తలనొప్పిగావుంది. నువ్వెళ్లి రా తల్లీ!" అన్నాడు కేశవరావు.

విమల తండ్రి ముఖంలోకి చూసింది.

"నాన్నా! నీకు ఒంట్లో బాగా లేదా? నాకు చెప్పలేదేం? ఆతృతతో అడిగింది విమల.

"అబ్బే కొంచెం తలనొప్పిగా వుంది అంతే! ఆ భాగ్యానికి నిన్నుకూడా హైరానా పెట్టడం ఎందుకని ఊరుకున్నాను. అదే తగ్గిపోతుంది నువ్వెళ్ల."

"కారు పంపించేస్తాను. రేపు వెళతానులే. నీకు అమృ తాంజనం రాస్తాను." అంటూ విమల లోపలకు వెళ్ళబోయింది.

"ఒద్దమ్మా! పొద్దుటికంటే చాలావరకు తగ్గింది. నువ్వె ళ్లిరా! రాజమణీదేవి గారికి జ్వరం వస్తుందని తెలిసీ కారు తిప్పి పంపించడం భావ్యం కాదు. ఆమె నీ మీద చూపిస్తున్న ఆదరాభి మానాలకు ఋణం ఈ జన్మలో తీర్చుకోలేవు."

"అవును నాన్నా! ఆమెకు మనం చాలా ఋణపడి పోతున్నాం అనిపిస్తుంది."

విమల రాజమణీదేవి గదిలోకి ప్రవేశించేప్పటికి ఆమె నిద్ర పోతోంది. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. మాధవరావుకూడా ఉన్నట్లు లేదు. నిద్రా భంగం కలిగించకుండా విమల గది బయటకు వచ్చింది. హాల్లో గోడలకున్న ఫొటోలకేసి చూస్తూ కాసేపు గడిపింది. రాజమణీదేవి నిద్ర లేవలేదు. విమలకు సత్యాన్ని చూడాలనిపించింది.

ఏం చేస్తున్నాడో ? మాధవరావు కూడా సత్యం గదిలోనే వున్నాడేమో ? మాధవరావు ఇంట్లో వుంటే ఇల్లు ఇంత ప్రశాంతంగా ఉండదు. ఏదో హడావిడి చేస్తూనేవుంటాడు.

ఆలోచిస్తూ యాదాలాపంగా విమల సత్యం గదిలోకి అడుగు పెట్టింది.

సత్యం చిత్రలేఖనంలో తన్ను తాను మర్చిపోయి వున్నాడు.

విమల మంత్రముగ్ధలా, ఆ కళా తపస్వినిచూస్తూ వాకిట్లోనే నిల్చిపోయింది.

కళ అతని జీవితంతో పెనవేసుకొనిపోయింది. కళను సత్యంనుంచి విడదీసిననాడు సత్యం వుండడేమో !

తన ఆలోచనకు ఉలిక్కిపడింది విమల.

సత్యం చేతిలోని కుంచెను పక్కన వుంచాడు. కొంచెం రెండడుగులు వెనక్కువచ్చి ఆ చిత్రాన్ని అన్ని కోణాలనుంచీ పరికించసాగాడు.

తన వెనక ఎవరో నిలబడినట్లయి గిరున తిరిగి చూశాడు.

మీరా ? ఎప్పుడొచ్చారు ? కూర్చోండి !" అని మళ్ళీ తన పనిలో మునిగిపోయాడు.

"మీ పనికి అంతరాయం కలిగిస్తున్నానా !"

"అబ్బే అదేం లేదు కూర్చోండి." సత్యం చిత్రం మీద నుంచి కళ్ళను మరల్చకుండానే జవాబిచ్చాడు. విమల ఉత్సాహంగా కొంచెం ముందుకొచ్చి సత్యం పక్కగా నిల్చొని చిత్రాన్ని చూడ సాగింది.

విమల మనస్సు చిత్రంమీద లగ్నం కావటం లేదు.

సత్యం ఆమె ఉనికినే మర్చిపోయి చిత్ర పరిశీలనలో మునిగిపోయాడు.

విమల మనస్సు చివుక్కుమన్నది.

అయినా ఆమెకు అక్కడ నుంచి కదలాలని లేదు. పక్కగా వున్న కుర్చీలో కూర్చొంది.

ఐదు-పది- నిమిషాలు గడిచిపోయాయి. మరో పదిహేను నిమిషాలు కూడా గడచిపోయాయి.

సత్యం చేతిలోకి మళ్ళీ బ్రష్ తీసుకున్నాడు.

విమలకు రోషం వచ్చింది. కోపం వచ్చింది. అభిమానం దెబ్బతిని విలవిల్లాడింది.

సత్యం ఇంత కుసంస్కారా ? ఒక యువతి గదిలో వున్నా గమనించనట్లే ప్రవర్తించడం సంస్కారం అనిపించుకుంటుందా ?

అలా అయివుండదు. సత్యం పనిలో మునిగిపోయి తన ఉనికినే మర్చిపోయి వుంటాడు.

ఒక వేళ నిర్లక్ష్యమేమో ! తను ఎంత చనువుగా వుండాలని ప్రయత్నిస్తుందో అతను అంత దూరంగా జరుగుతూనే వున్నాడు.

బుద్ధి పూర్వకంగానే నిర్లక్ష్యం చేస్తున్నాడు.

తన గదిలోకి చొరవగా వచ్చిన యువతిని ఒక యువకుడు నిర్లక్ష్యంగా ఆమె ఉనికినే గమనించనట్లు ప్రవర్తించడం అవమానించటం కాదా ?

స్త్రీకి, అభిమానంగల యువతికి, ఇంతకంటే అవమానం ఇంకేం కావాలి ?

ఇదే మాధవ్ అయితే ?

ఇంత నిర్లక్ష్యం చేస్తాడా ?

ఇలా అవమానిస్తాడా ?

విమల పొంగివస్తున్న దుఃఖాన్ని గొంతులో నుంచే దిగమింగే ప్రయత్నంలో సతమతం కాసాగింది.

ఆకస్మాత్తుగా వెక్కిళ్ళు వినిపించి సత్యం గిర్రున తల తిప్పి చూశాడు.

విభ్రాంత పోయాడు.

విమల రెండు చేతుల్లో ముఖాన్ని కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తూంది.

సత్యం అలా చూస్తూనే నిల్చునిపోయాడు. తను చూస్తున్నదేమిటో అర్థం చేసుకోవటానికి కొద్ది క్షణాలు పట్టింది.

విమల ఏడుస్తోందా ? ఎంతో గంభీరంగా కనిపించే విమల ఇంత అమాయకంగా ఏడుస్తోందా ?

ఎంతో విజ్ఞానవతీ, విద్యావతీ అయిన విమల తన గదిలో ఎందుకు ఇంత బేలాల ఏడుస్తోంది ?

మాష్టరుగారికి ఏంజరగలేదు కదా ? ఏదో కష్టం వచ్చి వుంటుంది. తను మూర్ఖుడు. ఆమె వచ్చిన కారణం కూడా అడగలేదు.

సత్యం సిగ్గు పడ్డాడు. ఏంవినాల్సివస్తుందోనని భయం కూడా కలిగింది.

" విమలాదేవిగారూ ? ఏమయింది " ? ఆత్రుతతో అడిగాడు సత్యం రెండడుగులు ముందుకువేసి.

విమల జవాబివ్వలేదు.

ఉద్భృతం అయిన దుఃఖాన్ని దిగమింగే ప్రయత్నంలో ఇంకా పెద్దగా వెక్కిళ్ళు రాసాగాయి.

సత్యం గాబరా పడ్డాడు మరో రెండడుగులు ముందుకు వేశాడు. వచ్చి ఆమె కుర్చీ పక్కగా నిల్చున్నాడు.

"ఏమండీ ? ఏమయింది ? మాస్టరుగారు కులాసాగా వున్నారా ?" ఆదుర్దాగా ప్రశ్నించాడు సత్యం.

విమల నుంచి జవాబు లేదు

వెక్కి వెక్కి ఏడుస్తోంది ఆ దుఃఖం చూస్తుంటే ఎంతో కాలం నుంచి హృదయంలో గడ్డ కట్టుకొనివున్న ఆవేదన ఒక్కసారిగా కరిగి వెల్లువై వరదలా ప్రవహిస్తోంది అని అనిపిస్తుంది

సత్యానికి భయం చిరాకూ కూడా కలిగాయి కారణం తెలియక పోవటం వల్ల.

"చెప్పండి ఏం జరిగింది ?" అసహనంగా ప్రశ్నించాడు.

విమల నుంచి ఎలాంటి సమాధానం లేదు.

సత్యం అప్రయత్నంగానే ముఖానికి కప్పుకొన్న ఆమె చేతుల్ని విడదీస్తూ అన్నాడు.

"ఎందుకింతగా ఏడుస్తున్నారు. మాష్టారు ఎలావున్నారు ?"

విమల తన చేతులమీద వున్న సత్యం చేతిని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని. అతని అర చేతిలో ముఖం దాచుకొని ఏడ్వసాగింది దుఃఖం మళ్లీ ఉవ్వెత్తుగా లేచింది.

సత్యం గాబరాగా నిల్చున్నాడు.

"నాకు భయంగా వుంది. చెప్పండి ఎందుకు ఏడుస్తున్నారు ? అన్నాడు సత్యం తన చేతిని ఆమె చేతుల నుంచి విడదీసుకునే ప్రయత్నం చెయ్యకుండానే.

"ఏమి లేదు ...... ఊరికే ఏడుస్తున్నాను." వెక్కిళ్ళ మధ్యలో అంది విమల.

సత్యం తెల్లబోయి చూశాడు.

"ఊరికే ఏడుస్తున్నారా ?" ఆశ్చర్యం ధ్వనించింది అతని కంఠంలో. తన చేతిని విమల చేతుల నుంచి చిన్నగా లాగుకున్నాడు.

"మీరు నన్ను అవమానించారు. ముఖాన్ని పైట చెరుగుతో తుడుచుకుంటూ అంది విమల.

సత్యం అదిరి పడ్డాడు. ఓ క్షణం ఆమెవైపు దీక్షగా చూశాడు. విమల మునిపంటితో కింది పెదవిని కొరుక్కుంటూ దుఃఖాన్ని ఆపుకొనే ప్రయత్నంలో సతమతమవుతోంది.

"నేను మిమ్మల్ని అవమానించానా?"

విమల తలవంచుకొని అలాగే కూర్చుంది శోకమూర్తిలా.

"నేను మిమ్మల్ని అవమానించటమా! నాకేమీ తెలియడం లేదు మీరంటే నాకెంతో గౌరవం. మాస్టరుగారు నాకు ఆరాధ్య దైవం. మీ కుటుంబంలోని సభ్యుల్ని కలలో కూడా చిన్నచూపు చూడలేని మిమ్మల్ని అవమానించానా?" సత్యం మాటలు తనకు తానే చెప్పుకుంటున్నట్లున్నాయి మంద్రస్థాయిలో.

విమల మరోసారి పైటచెంగులో ముఖం తుడుచుకొన్నది.

"చిన్నప్పటి నుంచి మీరంటేనాకెంతో గౌరవం!"

"హుం! గౌరవం! గౌరవం! ఎవరికి కావాలి ఈ గౌరవం!" విమల నిర్లక్ష్యంగా, విసుగ్గా అంది సత్యం మాటలకు మధ్యలోనే అడ్డుపడుతూ.

సత్యం విమల ముఖంలోకి విస్తుబోయి చూశాడు.

"గౌరవం అనే పదాన్ని అంత తేలిగ్గా తృణీకరించకండి! ఇతరులచేత గౌరవించబడాలని ఎవరి కుండదు? ఈ గౌరవంకోసం ఎంతమంది మనసులో లేని మంచి తనాన్ని పైకి చూపించడం లేదు? మనిషి డబ్బుకంటే కూడా ఇతరులచేత గౌరవించబడాలని ఆకాంక్షిస్తాడు! ఒకరిచేత నిజంగా గౌరవించబడడం కంటే మానవ జన్మకు సార్థకత ఏముంది?" పైకి అనాలనుకున్నా మాటల్ని మనస్సులోనే అనుకున్నాడు సత్యం.

"గౌరవించబడాలని మీకు వుండదూ?" అని మాత్రం అడగ్గలిగాడు.

"వుంటుంది గౌరవాన్ని పొందాలని ఎవరికుండదు!?

"మరి...________?"

"అందరిచేతా అన్ని చోట్లాకాదు. మనిషికి కావాల్సింది కేవలం గౌరవించబడటమే కాదు" అంది విమల తగ్గుస్థాయిలో.

సత్యం అయోమయంగా చూశాడు విమల ముఖంలోకి. ఏదో అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లు ఆమె ముఖంలోకి కళ్లలోకి లోతుగా చూశాడు.

ఆ చూపును తట్టుకోలేక విమల ముఖందించుకొంది. విమల చెక్కిళ్లు కొంచెంగా జేవురించడం సత్యం కళ్ల పడింది.

సత్యానికి ఏదో లీలగా తోచింది.

ఓ క్షణం ఆశ్చర్యం కలిగింది.

మరుక్షణంలోనే తత్తరపాటు కలిగింది. ఆనందం విషాదం సమ్మేళనంవల్ల వింత అనుభూతికలిగింది.

ఇది నిజమేనా! తను ఊహిస్తున్నది నిజమేనా! కాదు___ అలా ఎన్నటికీ కాకూడదు. ఇంత విజ్ఞానవతి తనలాంటి ఏ డిగ్రీలు లేనివాణ్ణి ...అవిటివాణ్ణి ప్రేమించటమా?

లేదు తను పొరపాటుపడుతున్నాడు! తనతో పాటుపెరిగిన సరళ—తన మనస్సును అర్థం చేసుకోగలదని నమ్మిన సరళే తనను స్వీకరించలేక పోయింది.

తను అవిటివాడు. తనను ఏ స్త్రీ కూడా చూస్తూ చూస్తూ ప్రేమించలేదు. ఒకసారి దెబ్బతిన్న తన హృదయం......అలా భ్రమపడుతోంది...అంతే అది నిజం కాదు. కాకూడదు.

సత్యం వెనక్కు తిరిగి కిటికీ దగ్గరకెళ్ళి బయటకుచూస్తూ నిల్చున్నాడు. బుర్రలో లక్ష ప్రశ్నలు అల్లిబిల్లి తిరుగుతున్నాయి.

తనలో చోటుచేసుకోవటానికి ప్రయత్నిస్తున్న బలహీనతను బలంగా బయటకు నెట్టటానికి ప్రయత్నిస్తున్నాడా అన్నట్లు కిటికీ చువ్వల్ని గట్టిగా పట్టుకున్నాడు.

బయటకు చూస్తూన్నాడు. అతనికి ఏమీ కన్పించడంలేదు.

[సశేషం]

# చైతన్యమూర్తులు



## విశ్వనాథ సత్యనారాయణ

నన్ను నెఱు రో యీ తెలుగునాట మీరు
విశ్వనాథ కులాంభోధి విధుని బహువి
చిత్ర చిత్రధ్వని బహు విచ్ఛిత్తి మన్మ
హాకృతి ప్రణేత సత్యనారాయణ కవి

విశ్వనాథవారి 'త్రిశూల' నాటకంలోని పద్యం ఇది. ఔను. తెలుగునాట వారిని ఎరగని వారెవరు ? ఆయన కళాప్రపూర్ణుడు. కవి సమ్రాట్టు తెలుగువారు ఆయనకు గజారోహణోత్సవం జరిపించారు. భారత ప్రభుత్వం ఇప్పుడు ఆయనకు 'పద్మభూషణ' బిరుదు ప్రదానం చేసింది.

ఆయన చెప్పుకొన్నట్లు ఆయన విశ్వనాథ కులాంభోధి విధుడు. ఆంధ్రసాహిత్య పద్మాకరాన్ని ప్రకాశవంతం చేస్తున్న ప్రభాకరుడు కూడా అంశుమంతుడు తన సహస్ర కిరణాలతో సర్వత్ర ప్రభావాన్ని ప్రసరింపజేస్తున్నట్లు ఈ సాహిత్య భాస్కరుడు తన సహస్ర మయూఖాలతో ఆంధ్ర వాఙ్మయ ప్రపంచాన్ని ప్రజ్వలింప జేస్తున్నాడు. ఒక్కొక్క సాహిత్య ఖండమూ ఒక్కొక్క మండలం ఐతే ఆ సమస్త మండలాలపై విశ్వవాల్లభ్యం గల విశ్వనాథుడాయన. ఆయన లేఖినికి అందుబడిలేని సాహిత్యప్రక్రియలేదు ఆయన లేఖిని అలంకరింపని సాహిత్య ప్రకరణంలేదు.

విశ్వనాథ నవలలో కథాకథన పాటవమే కాదు, మానవ స్వభావ చిత్రణమేకాదు. కళా సంస్కృతి విజ్ఞానాది వివిధానేక విషయ వివరణం కూడా ఉండడం విశేషం.

ఆయన సంస్కృత శబ్ద సంధానంలో ఎంత బింకం ఉంటుందో ఆయన జానుతెలుగు పలుకుల కూర్పులో అంతపొంకమూ కనిపిస్తుంది. పద్యంచేత పాడించడమేకాదు గద్యంచేత గజ్జె కట్టించగల కళాకారుడాయన. ప్రబంధకవిత్వమే కాదు, భావకవిత్వాన్ని కూడా సొంత చేసుకొన్న సూరి సత్తముడు. ఆయన వ్రాతలోనే కాదు. వాచకంలో కూడా విశిష్టమైన ఒక ఒడుపూ ఒక వాటమూ వాలుచూపు చూస్తూ ఉంటాయి.

బందా చేత గుత్తివంకాయపాట రఘురామయ్యచేత ఈలపాట పాడించుకొన్నట్లు విశ్వనాథచేత కిన్నెరపాట పాడించుకోవడం పరిపాటి అయింది

తేనెలై కలకండ సోనలై వానలై
చాన కిన్నెరపాట సాగింపజేసి

తెలుగువారి గుండెలలో ఆ గానాన్ని నిరర్గళంగా నిస్వసింపజేసిన సంగీత నిర్దేశకుడు ఆయన.

తలచిన రామునే తలచెద నేనును
నాభక్తి రచనలు నావి కావ

అని చెప్పుకొని రామాయణ కల్పవృక్షంలో పూలు పూయించి రామపూజ చేసిన భక్తుడాయన.

ఇది మెచ్చదరో మెచ్చరో
ఇదియును జదివెదరు చదువ రేలా నాక
య్యది ? నాయెడ మీతో రా
చెవ శ్రద్ధానికి ఫలంబు చెందించు శివా !

ఇతరుల మెప్పుకోసం కాక ఈశ్వరార్పణ బుద్ధితో కవిత్వం చెప్పుకొనే కర్మిష్ఠుడాయన.

ఉదాత్తమైన కవిత్వమేకాక ఉబుసుపోక కవిత్వం కూడా చెప్పగల సమర్థుడు.

---

**శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కేంద్ర సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యులుగా ఎన్నికైనారు**

---

విశ్వనాథవారి పాండితీ విభూతిలో కవితా విన్యాసంలో, రచనా విభవంలో ఒక విశిష్టమైన విన్నాణం విన్యాసం ఉంటుంది. ఆయన మహోన్నతుడు. మహాగంభీరుడు. మహామనీషి, మహా వ్యక్తి.



## గుర్రం జాషువ

మధుర రసమును గడుపున మాటుకొన్న
ద్రాక్షఫల గుళుచ్ఛముల యందముల తూగు
వర కవీంద్రుని కావ్య ప్రపంచమందు
ప్రతి పదంబున మదికి దర్శన మొసంగు

జాషువ కవి ఈ పద్యంలో చెప్పిన కవిత్వ లక్షణానికి ఆయన కవిత్వమే లక్ష్యంగా ఉంది.

ఖండ కావ్యాలలో అఖండ రసానందాన్ని కందళింపజేసిన కవిసత్తముడు జాషువ. ఆయన ప్రతి పద్యమూ ఒకనాణ్యం, ఒక నయగారం, విశిష్టమైన సౌకుమార్యం, సౌరభ్యం సంతరించుకొని ఉంటుంది. ప్రతి పద్యమేకాదు. ప్రతిపాదము రసాస్పదమై ఉంటుంది.

చిత్రకారుడు రంగులలో చేసే చమత్కారం ఈ కవి శబ్దాలలో కల్పిస్తాడు.

'నాల్గు పడగల హైందవ నాగరాజు'
'అవని పాలించు భస్మసింహాసనంబు'

ఒక్కొక్క పాదములో ఒక్కొక్క సంపూర్ణ శబ్దచిత్రం

శబ్దతత్త్వాన్ని సమధిగతం జేసుకున్న ఈ కవికి ఐదుబడుల అక్షరాలు నేర్చుకోడానికి రెండేళ్లు పట్టిందట! బొమ్మలు గీయడంలో అభిరుచి. చిలిపి చేష్టలకు పెట్టింది పేరు. కొంటెకోణంగి అని ప్రసిద్ధి. చదువు సరిగా అబ్బక చీవాట్లూ బెత్తం దెబ్బలూ తింటూ గోడకుర్చీలు వేయవలసి వచ్చేది. పిట్టలంటే పిచ్చిసరదా

కొంటెతనం కుదిరి కొంతవయస్సు వచ్చిన తరువాత బడి పంతులవృత్తి. పాండిత్యం సంపాదించాలంటే ఉపదేష్ట లేదు. కవిత్వం చెప్పదామంటే కఠినమైన ఆంక్ష. వీరేశలింగ కృతిపఠనంలో తెలుగు పలుకుబడిలోని తియ్యదనపు చవి తగిలింది. పుణ్యాత్ముడు జూపూడి హనుమచ్ఛాస్త్రి అనుగ్రహంతో కాళిదాసత్రయం సంచితం అయింది. నైషధకావ్య ఔషధం కొంత సేవించాడు. కనబడిన కావ్యాలన్నీ ఆత్రంతో చదివాడు. తనివితీరా మహాభారత కావ్య రసాస్వాదనం చేశాడు.

వర్ణిత వస్తువు తానై
పూర్ణంబుగ గరగి మారిపోవలయు కవుల్
అనే సత్యాన్ని గ్రహించి కలంపట్టాడు కవి కుమారుడు.

చిన్ననాటినుంచి కులమత వాదుల క్రౌర్యానికి గురియై తెల్లదొరల పెత్తనానికివ్యధచెంది తెలుగుభాషను తిరస్కరించే ఆంగ్లవిద్యాధికుల తీరునకు దిగులుచెందిన కవిలో మానవత్వంకోసం స్వాతంత్ర్యం కోసం ఆంధ్రత్వం కోసం పాటుపడే మనస్తత్త్వం మటమట లాడింది.

ఎన్ని అడ్డులూ ఆటంకాలూ కలుగుతున్నా సహజమైన కవితావేశాన్ని అణచుకోలేక అర్ధశతాబ్దిగా ఆంధ్రభారతిని ఆరాధిస్తున్న ధన్యజీవి, జాషువకవి. సమకాలీనుల ఆదరణకూ, సామాన్య ప్రజల అభిమానానికీ పాత్రుడైన భాగ్యశాలి జాషువకవి. కవిదిగ్గజమని కవికోకిల అని కవితా విశారదుడని నవయుగ కవి చక్రవర్తి అని ప్రశంసించి లోకం ఆయనకు ఆరతి పట్టింది. గండపెండరం, గజారోహణం, కనకాభిషేకం – ఇవన్నీ ప్రజలు చేసిన సన్మానాలే. ఇప్పుడాయన 'పద్మభూషణ' భూషితుడయ్యాడు.

ఏ సన్మానాలూ, సత్కారాలూ జరగకపోయినా కూడా

గంటము ధరించి మోహనాక్షరము లెనయ
ప్రతిఫలించెడు నా మహోన్నత విభూతి
వ్రాసికొందును దశదిశాఫలక పంక్తి
గడన కెక్కిన ఆంధ్రపుత్రుడను నేను

అని సగర్వంగా సార్ధంగా చెప్పుకోగల సాహితీసంపన్నుడు జాషువకవి.

— కళ్యాణ సింగ్

## ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

ప్రపంచ మేధావులలో ఒకరుగా గణుతికెక్కిన డా. ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ జూరిచ్‌లోని స్విస్ ఫెడరల్ పోలీటెక్నిక్ సంస్థ నుంచి పట్టభద్రుడయ్యాడు. ఆయన చదువుకు ఒక బంధువు ఆర్థిక సహాయం చేశాడు. పట్టభద్రుడైన రెండేండ్ల వరకు ఆయనకు ఎక్కడా నిలకడగల ఉద్యోగం దొరకలేదు. తాత్కాలికంగా టీచరు ఉద్యోగాలుచేస్తూ కొంతకాలం జీవితం గడిపాడు. కట్టకడపటికి ఒక స్నేహితుని సహాయంతో అయన బెర్నెలో స్విస్‌పేటెంట్ ఆఫీసులో ఎక్జామినర్ ఉద్యోగం సంపాదించాడు. సాలీనా వచ్చే మూడువేల ఫ్రాంకుల వేతనంలో ఆయన జీవితం సుఖంగా జరి

గింది! పని తక్కువ విరామమెక్కువ ఉండడంవల్ల తీరిక సమయాలను విజ్ఞాన శాస్త్రపరిశోధనకు వినియోగించాడు. కేవలం 26 ఏండ్ల చిన్న వయస్సులో సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రచురించాడు. విజ్ఞాన శాస్త్రప్రపంచంలో ఈ సిద్ధాంతం గొప్ప విప్లవం తీసుకొని వచ్చింది.

ఆయన కనుగొన్న సాపేక్ష సిద్ధాంతం అంతిమంగా అణుబాంబు ఉత్పత్తికి దోహదకారి అయింది. ఇందుకు ఐన్‌స్టీన్ ప్రత్యక్షంగా బాధ్యుడుకాడు.

ఐన్‌స్టీన్‌కు ఆయన 42వ ఏట భౌతికశాస్త్రంలో నోబుల్ బహుమతి లభించింది. గణిత భౌతికశాస్త్రానికి ఆయన చేసిన కృషికి ముఖ్యంగా ఫొటో ఎలెక్ట్రిక్ ప్రభావానికి సూత్రాన్ని కనుగొన్నందుకు ఆయనకు ఈ బహుమతి లభించింది.

ఐన్‌స్టీన్ విజ్ఞాన సిద్ధాంతాలు అన్నీ మనకు సామాన్యంగా అర్థంకావు. ఆయన సాపేక్షసిద్ధాంతాన్ని సరిగా అర్థం చేసుకొన్న మేధావులు మహా అయితే 12 మందికి మించి వుండరని చెబుతారు.

విజ్ఞాన శాస్త్రవేత్తగా ఐన్‌స్టీన్‌ను అర్థం చేసుకోవడం సాధ్యం కాకపోవచ్చు. అయితే ఒక మహా మనీషిగా అయన్ను అర్థం చేసుకోవడం సులభం. తనకు లభించిన నోబుల్ బహుమతి ధనాన్ని ఆయన దానధర్మాలకు వినియోగించాడు. తన 50 జన్మదినోత్సవ సందర్భంలో ప్రజల ప్రశంసలు తప్పించుకొనేందుకు తానువున్న ఇంటి నుంచి ఎవ్వరికీ తెలీకుండా మాయమయ్యాడు. తనకు వచ్చిన శుభాకాంక్షలు సందేశాలను బుట్టదాఖలా చేశాడు.

1952లో ఇజ్రాయేలు అధ్యక్షులు వీజ్‌మాన్ మరణించాడు. ఈ అధ్యక్షపీఠాన్ని అలంకరించవలసిందని "యూదీయులలో అగ్రగణ్యుడైన" ఐన్‌స్టీన్‌ను అభ్యర్థించగా, ఆయన దీనిని త్రోసిపుచ్చారు.

ప్రిన్స్‌టన్‌లో ఒక చిన్న ఇంటిలో ఆయన నివసించేవాడు. తాను పనిచేసే పరిశోధనాలయానికి రోజూ నడిచి వెళ్ళేవాడు. నిరాడంబరజీవి ఆయన. ఖరీదైన ఆకర్షణీయమైన దుస్తులు ఎప్పుడూ వేసుకొనేవాడుకాదు. సమాజంలోని ఆచారవ్యవహారాలను పాటించని వింతవ్యక్తి ఆయన. విందుభోజనాలు, ఆహ్వానాలు అంటే ఆయనకు గిట్టవు.

ఐన్‌స్టీన్ పరమశాంతి ప్రియుడు. గాంధీజీని ఆయన నైతిక బలాన్ని చాల మెచ్చుకొన్నవ్యక్తి. ఆయనకు సంగీతమంటే చాల అభిమానం ఫిడేలుపై, మొజార్ట్, బాఖ్ ఆలాపనలు చేసేవాడు. నడవడం, బోటులో విహారం చేయడం ఆయనకు సరదా.

ఐన్‌స్టీన్ శాస్త్రవేత్త అయినప్పటికీ, మతాన్ని ద్వేషించలేదు.

మనబోటి సామాన్యులకు విజ్ఞాన శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌ను అర్థంచేసుకోవడం సాధ్యంకానిపని. అయితే ఆయనలోని గొప్ప లక్షణాలను అర్థం చేసుకొని ఆచరణలో పెట్టడానికి మనలో ప్రతి ఒక్కరూ ప్రయత్నం చేయవచ్చు.



## బెర్ట్రాండ్ రసెల్

విశ్వవిఖ్యాత బ్రిటిష్ తత్త్వవేత్త, రచయిత బెర్ట్రాండ్ రసెల్ ఫిబ్రవరి 2న అస్తమించారు. వీరి వయస్సు 97 సంవత్సరాలు.

రసెల్ ఉత్తరవేల్స్ పట్టణంలోని వారి స్వగృహంలో సోమవారం రాత్రి 12-30 గంటలకు ఈ లోకాన్ని వదలి వెళ్లారు. రసెల్ అణ్వస్త్రాది మారణాయుధాల నుండి ప్రపంచాన్ని రక్షించాలని పోరాడిన మహనీయుడు. రసెల్ ప్రఖ్యాత తత్త్వవేత్త, రచయిత కూడా.

సాహిత్యంలో వీరి కృషికి నోబెల్ బహుమానం లభించింది. 40కి పైగా ఉత్తమ గ్రంథాలను రచించారు.

ఎరల్ రసెల్ 1872 మే, 18న జన్మించారు. 17వ శతాబ్దం నుండి వీరి వంశం ప్రభువుల వంశం. 11వ యేటనే రసెల్ గణిత శాస్త్రంలో అఖండమైన ప్రతిభ సంపాదించారు. కేంబ్రిడ్జిలో చదువుకొన్నారు. సాహిత్యం, తత్త్వశాస్త్రం మున్నగు వాటిలో గొప్ప అభిరుచి కలిగి, వాటిలో కృషి చేశారు. మొదటి ప్రపంచ యుద్ధంలో శాంతివాదిగా దానిని వ్యతిరేకించి జైలుకు వెళ్ళారు. జైలులోనే "గణిత తత్వ దర్శనానికి "పీఠిక" అను గ్రంథాన్ని రాశారు. వారి రచనలలో అత్యంత ప్రధానమైన రచన యిది.

వియత్నాంలో అమెరికనులు రాక్షసకృత్యాలు జరిపినట్లు వచ్చిన వార్తలపై దర్యాప్తు జరపడానికి ఒక "అంతర్జాతీయ యుద్ధ నేరాల పరిశీలన కమిషన్'ను బలపరచవలసిందిగా ఈయన ఐక్యరాజ్య సమితిని కోరారు.

రసెల్ నాలుగు సార్లు వివాహం చేసుకున్నారు. తన 22వ, సంవత్సరంలో మొదటి వివాహం చేసుకున్నారు. వీరు స్వర్గస్థులు కావడానికి ముందు ఇన్‌ఫ్లూ యెంజాతో బాధపడ్డారు. 

# యాత్రిక వారోత్సవాలు



1970 జనవరి 16 నుండి 22 వరకు ఆంధ్రప్రదేశ్ యాత్రిక వారోత్సవాలు నిర్వహించబడినవి.

యాత్రలవల్ల పరస్పర అవగాహన, మైత్రీ వర్ధిల్లుతాయి అంతే కాక ఆర్థిక దృష్ట్యాకూడా వీటికి మంచి ప్రాముఖ్యం ఉంది. స్వదేశ యాత్రలు జాతీయ సమైక్యతను పెంపొందించడానికి బాగా తోడ్పడతాయి. విదేశ మారకాన్ని ఆర్జించే రంగంగా యాత్రిక పరిశ్రమ అన్ని రాష్ట్రాల దృష్టిని బాగా ఆకర్షించి, అభివృద్ధి పరచ బడుతున్నది. యాత్రా కేంద్రాల ఉనికిలో ఆంధ్రప్రదేశ్ భారత దేశంలో ప్రముఖ స్థానం వహిస్తున్నది.

వింధ్య పర్వతాలకు దక్షిణానవున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అపూర్వ చారిత్రక అవశేషాలు, పురావస్తు విశేషాలు, దివ్య దేవాలయాలు, సుందర సరస్సులు, మనోజ్ఞమైన జలపాతాలు, సముద్ర తీరాలు, చక్కని వేసవి విశ్రాంతి కేంద్రాలు, ఆహ్లాదం కలిగించే అరణ్యాలు, మృగ పక్షి జాతులు, జవహర్‌లాల్ నెహ్రూ ప్రీతితో అభివర్ణించినటువంటి "గొప్ప ఆధునిక దేవాలయాలు" సమృద్ధిగా వున్నాయి. ఇవన్నీ దేశ విదేశ జనాన్ని యాత్రికుల దృష్టిని విశేషంగా ఆకరిస్తాయి, రాష్ట్రంలో యాత్రాభివృద్ధికి ఇవి చక్కని వనరులు.

రాష్ట్ర రాజధాని హైదరాబాదు నగరమే యాత్రికులను మిక్కుటంగా ఆకర్షించే ఒక ప్రధాన కేంద్రం. ప్రపంచంలోని జంట నగరాలలో ఒకటైన హైదరాబాదును భారత దేశపు బుడాపెస్టుగా పేర్కొనడం ఎంతైనా సముచితంగా ఉంటుంది. హుసేన్‌సాగర్ జలాలు హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలను విడదీస్తున్నాయి. సముద్రమట్టానికి సుమారు 2000 ల అడుగుల ఎత్తునవున్న ఈ నగరపు శీతోష్ణ పరిస్థితులు సంవత్సరం పొడవునా ఆహ్లాదకరంగా వుంటాయి

మహత్తరమైన అనేక ప్రాచీన అవశేషాలు, సుందర సరస్సులు, మసీదులు, అద్భుతమైన పురావస్తు ప్రదర్శనశాలలు, గోపురాలు, వంతెనలు ఈ నగరంలో వున్నాయి, ఇచ్చటి అద్భుతమైన ప్రాచీన కట్టడాలలో చార్మినార్ ప్రసిద్ధమైనది. గోలకొండ సుల్తాను హైదరాబాదునగర స్థాపకుడూ అయిన మహమ్మద్ ఖులీ ఖుతుబ్‌శా 1591 వ సంవత్సరంలో దీనిని నిర్మించాడు. ఈ కట్టడం అగ్రంనుంచి నగర దృశ్యాలను విహంగవీక్షణతో తిలకించవచ్చు. ప్రస్తుతం చార్మినార్‌వద్ద ఫ్లడ్ లైట్లను అమర్చడానికి ఏర్పాటు జరిగింది. ఇది పూర్తి అయినపుడు రాత్రి సమయంలో ఇచ్చట నేత్రానందకరమైన దృశ్యం కనిపిస్తుంది

## శ్రీమతి రోడామిస్త్రీ

హైదరాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియం అపూర్వమైన ప్రాచీన కళాఖండాలతోకూడిన అద్వితీయమైన వస్తు ప్రదర్శనశాల. ఇందులోని కళాఖండాలన్నీ మూడవ సాలార్‌జంగ్‌చే దేశదేశాలనుంచీ స్వయంగా సేకరించబడినవి. పశ్చిమ ఆసియా, జపాను, చైనా, పాశ్చాత్య దేశాలనుంచి సేకరించిన 'జేడ్' వస్తువులు, ఆభరణాలు, వర్ణ చిత్రాలు, ప్రతిమలు, కొయ్యతో తయారు చేసిన అద్భుతమైన అలంకార వస్తువులు, కుర్చీలు, మొదలైన వాటిని ఈ ప్రదర్శనశాలలో చూడవచ్చు. చలువరాతిలో చెక్కిన మేలి ముసుగు ధరించిన "రెబెక్కా" ప్రతిమ సాటిలేనిది. హైదరాబాదును సందర్శించవచ్చే యాత్రికులు తప్పనిసరిగా దర్శించవలసినది సాలార్‌జంగ్ మ్యూజియం దక్షిణాదిలోని ఆకర్షణీయమైన మసీదులలో ఒకటైన మక్కా మసీదు హైదరాబాదులోవుంది. ఇచ్చటి స్తంభాలూ, ద్వారములు, కమానులూ ఒకేఒక నల్లరాతితో నిర్మించబడడం యిందులో ప్రత్యేకత మొగల్ చక్రవర్తి ఔరంగజేబు 1687 సంవత్సరంలో దీని నిర్మాణాన్ని పూర్తి చేశాడు. నగర ప్రాంతంలో సుందర సరస్సులు, హిమాయత్ సాగర్, ఉస్మాన్‌సాగర్, హుస్సేన్‌సాగర్, మీర్‌ఆలం తటాకం వున్నాయి.

నగరానికి చుట్టు ప్రక్కల ఏర్పడుతున్న ఆధునిక పారిశ్రామిక సంస్థలు, రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధిని సాధించడం

# ఆంధ్రప్రదేశ్ యాత్రిక వారోత్సవాలు

1. న్యూ శాంతి భవన్, హైదరాబాదు
2. ఇండియన్ ఎయిర్ లైన్స్ కార్యాలయం
3. సికింద్రాబాదు రైలు స్టేషన్

**మధ్యలో చార్ మినార్**

5 రవీంద్రభారతిలో నృత్య ప్రదర్శన
6 రవీంద్ర భారతిలో "పెండ్లికూతుళ్ళు" ప్రదర్శన
7. వింటేజి కార ప్రదర్శన



కొరకు రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న తీవ్ర కృషిని చాటుతున్నాయి. మిశ్రమ సంస్కృతితో అలరారుతున్న హైదరాబాదు నగరం చారిత్రకారులచే దక్షిణాదిగానూ, దక్షిణాత్యులచే ఉత్తర దేశంగానూ పరిగణింపబడుతున్నది. నిజానికి యిది ఈ రెండు ప్రాంతాలకూ వారధి. యాత్రికులకు హైదరాబాదును దర్శించడం చిన్న తరహా భారత దేశాన్ని దర్శించడమే అవుతుంది.

రాష్ట్రంలోని నాగార్జునసాగర్ ప్రాజెక్టు యాత్రికులకు స్వర్గతుల్యమైనది. నాగార్జునసాగర్ ఆనకట్ట చాల ఎత్తైనది, పెద్దది. ప్రపంచంలోని అతి పెద్దదైన మానవ నిర్మిత సరస్సులలో యిది మూడవది. గొప్ప ఇంజనీరింగ్ నైపుణ్యంతో కూడిన నాగార్జునసాగర్ చారిత్రకంగానూ, పురావస్తు విషయకంగానూ అత్యంత ప్రాముఖ్యం వహిస్తున్న ప్రాచీన స్థలాల సరసనిర్మితమైనది. ఇచ్చటి లోయ చాలా ప్రాచీనమైనది. ప్రకృతి దృశ్య మనోహరమైనది. నాగార్జున కొండ త్రవ్వకాలలో లభించిన అవశేషాలను "ద్వీప్రదర్శన శాల"లో పదిల పరచారు. ప్రపంచం మొత్తం మీద యిటువంటి ప్రదర్శనశాల యిదొక్కటే. ఈ ప్రదర్శనశాల యాత్రికులకు ఎంతో కనుందు కలిగిస్తుంది. ప్రపంచంలోనే యిలాంటి ప్రదర్శనశాలలు అరుదనవచ్చు. ఇక్కడి కొండ, సరస్సుల యొక్క రమణీయమైన దృశ్యం చూచినప్పుడు కలిగే అనుభూతి అసమానమైనది.

క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దిలో ఆచార్య నాగార్జునుని కాలంలో బౌద్ధ నాగరికత ప్రభవిల్లిన ప్రాచీన శిలా యుగంతో ప్రారంభమైన చరిత్రకు నాగార్జున కొండ ప్రాతినిధ్యం వహిస్తున్నది. కాబట్టి స్మరణీయమైన ఆరోజుల నాటి వాతావరణాన్ని కొంతవరకైనా జ్ఞప్తికి తేగల పార్కును యిచ్చట నిర్మించడం సముచితం. గుహలను, విహారాలను స్తూపాలను, బుద్ధుడు తదితర బౌద్ధ భిక్షువుల ప్రతిమలను నెలకొల్పవచ్చు. "కాంతి_ధ్వని" కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టడంవల్ల ఈ ప్రదేశం వైభవం పెరుగుతుంది. ఈ ద్వీపానికి అన్ని వైపుల నుంచీ రక్షణ వున్నది. కాబట్టి దీన్నిలోనికి జింకలు, నెమళ్లు మొదలైన వాటిని వదిలి పెట్టవచ్చు. ఇందువల్ల ఈ ద్వీపం శోభ పెంపొందుతుంది. భారతదేశమంతటి నుంచి వచ్చే వారికి యిది విజ్ఞాన విషయికంగా విలువైనదిగా భాసిల్లడమే కాకుండా సింహళం, థాయిలాండ్, కంబోడియా, లావోస్, జపాన్, ఫిలిప్పైన్స్ వంటి బౌద్ధ మతానికి చెందిన దేశాలనుంచి యాత్రికులనూ విరివిగా ఆకర్షించగలుదుతుంది. అందమైన సముద్ర తీరంతో కూడిన విశాఖ పట్టణం యాత్రికులను ఎంతో ఆకర్షిస్తుంది. చక్కని సముద్ర తీరాన్ని, స్వాభావికమైన రేవును కలిగి వున్న పట్టణమిది. ఇచ్చటి "డాల్ఫిన్స్‌నోస్" ద్వీప గృహం ప్రపంచంలోని శక్తివంతమైన ద్వీప గృహాలలో ఒకటి. "లాసన్ అఖాతం సముద్ర స్నానం చేసేవారికి ఎంతో అనువైనది. ఇదే జిల్లాలోని భీమ్యా పట్నం బీచ్‌ను చక్కగా అభివృద్ధి పరచవచ్చు.

ఆంధ్రప్రదేశ్ గొప్ప దేవాలయాలకు సైతం ప్రసిద్ధిజెందింది. ప్రత్యేకంగా పేర్కొనదగిన అతిముఖ్యమైన యాత్రాస్థలాలు -తిరుపతి, శ్రీశైలం, సింహాచలం, భద్రాచలం వరంగల్ వెయ్యి స్తంబాల గుడి, కొలనుపాక జైన మందిరం. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి ఈ స్థలాలకు అనేక మంది యాత్రికులు వస్తుంటారు.

ఆంధ్రప్రదేశ్‌ను సందర్శించవచ్చే యాత్రికులు ఇచ్చట వైవిధ్యంతో కూడిన ప్రకృతిదృశ్యాలను తిలకించగలుగుతారు పలురకాల మృగాలు, పక్షులు సంచరించే దట్టమైన అరణ్యాలు రాష్ట్రంలో వున్నాయి. ఇచ్చటిఅడవులలో కనిపించే మృగాలలో పె పులి, చిరుత పులి, నీలాగాయ్, నల్ల లేడి, ఎలుగుబంటి మొదలైనవి పేర్కొనదగినవి. పక్షులలోకూడా కొంగలు ముఖ్యమైనవి. వన్య మృగాలను చూడదలుచుకున్న వారికొరకు మృగయా వినోదానికి నిర్దేశింపబడిన అరణ్యాలున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఇటువంటి నాలుగు అరణ్యాలు వరంగల్ జిల్లాలోని పాఖాల, ఏటూరు, నాగారం, మెదక్ జిల్లాలోని పోచారం, ఆదిలాబాదు జిల్లాలోని కనత్‌లలో వున్నాయి. మృగయా వినోదానికి పాఖాల అరణ్యం ఎంతో అనువైనది. దీనిని అభివృద్ధి పరిచినట్లయితే విదేశమారకం ఎల్లప్పుడు లభించ. గలుగుతుంది

చిత్తూరు జిల్లాలో హార్స్లీ కొండలు ప్రశస్తమైన వేసవి విశ్రాంతి కేంద్రం. ఇది సముద్ర మట్టానికి 4000 అడుగుల ఎత్తున వుంది. ఈ ప్రదేశం మద్రాసునుంచి సుమారు 130 మైళ్ళ దూరంలోమాత్రమే వుంది. ఆదిలాబాదు జిల్లాలోని కుంతల, గుంటూరు జిల్లాలోని ఎత్తిపోతలవంటి రమణీయమైన జలపాతాలు రాష్ట్రంలో వున్నాయి. సుందరమైన పరిసరాలతోకూడిన ఈ ప్రదేశాలు వనభోజనాలకు వెళ్ళడానికి, ఆటవిడుపు సమయాన ఉలాసంగా గడపటానికీ చాలా అనువైనవి.

యాత్రికులను ఆకర్షించే ప్రదేశాల వునికివల్ల మాత్రమే యాత్రిక చిత్రం సర్వ సమగ్రం కాజాలదు. యాత్రికులకు సరసమైన రేటకు తగినంతగా భోజన వసతి, సదుపాయలనూ రవాణా సౌకర్యాలనూ కల్పించడం యాత్రలను నిర్వహించడం వంటివి జరగాలి. యాత్రికులు తమ ప్రయాణాన్ని సుఖప్రదంగా అర్థవంతంగా సాగించడానికి వీలుగా రాష్ట్ర ప్రభుత్వం వివిధ చర్యలు గైకొన్నది.

యాత్రాపరంగా అనేక ఆకర్షణలను కలిగివున్న ఆంధ్రప్రదేశ్ భారతదేశంలో మొదటి శ్రేణి యాత్రా రాష్ట్రంగా రూపొందటానికి చక్కగా ప్రయత్నిస్తున్నది. ఈ విషయంలో దీనికి గల వనరులు అపరిమితమైనవి.



# నక్సలైట్లు - అతివాద కమ్యూనిస్టుల హింసాకాండ

**పోలీసులు తీవ్రమైన చర్యలు తీసుకున్న ఫలితంగానూ, ముఖ్యులైన నక్సలైట్లను తీవ్రవాదులను అరెస్టు చేసిన కారణంగానూ, శ్రీకాకుళం, యితర ప్రాంతాలలో శాంతి భద్రతల పరిస్థితి మెరుగుపడింది. పట్టాలను మంజూరు చేయడంతో పాటు గిరిజన సంక్షేమానికి ప్రభుత్వం తీసుకున్న కొన్ని యితర చర్యల ఫలితంగా శ్రీకాకుళం ప్రాంతంలో గిరిజనులు నక్సలైట్ల కార్యక్రమాలకు విముఖత వ్యక్తం చేస్తున్నారు.**

1968 చివరి భాగంలోనూ 1969 సంవత్సరంలోనూ భారత కమ్యూనిస్టు (ఎం. ఎల్.) పార్టీ వారు అంటే నక్సలైట్లూ, టి. నాగిరెడ్డి వర్గానికి చెందిన అతివాద కమ్యూనిస్టులూ రాష్ట్రం లోని గ్రామీణ ప్రాంతాలలోనూ గిరిజన ప్రాంతాలలోనూ సాయుధ విప్లవం తీసుకు రావలనే తలంపుతో దారుణమైన హత్యాకాండలకూ, దోపిడీలకూ తల పడినారు. శ్రీకాకుళం, వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో వీరు చేసిన హింసాకాండ అన్ని వర్గాల ప్రజలనూ దిగ్భ్రాంతులను చేసింది. ప్రజలలో వారి పట్ల కోప తాపాలనూ, ద్వేష భావాన్ని పురికొల్పింది. 1969 సంవత్సరంలో నక్సలైట్లు ఒక్క శ్రీకాకుళం జిల్లాలోనే 23 హత్యలు చేశారు, 40 దోపిడీలు చేశారు. నక్సలైటు కార్యకర్తలు—అతి వాదులు వరంగల్లు జిల్లాలో 28 దోపిడీలు, 6 హత్యలూ, ఖమ్మం జిల్లాలో 20 దోపిడీలు 3 హత్యలూ, కరీంనగర్ జిల్లాలో 3 దోపిడీలు 1 హత్య, నల్లగొండ జిల్లాలో 2 దోపిడీలూ, గుంటూరు జిల్లాలో 3 దోపిడీలు 2 హత్యలూ, విశాఖ పట్నం జిల్లాలో 1 దోపిడీ, 1 హత్యా చేశారు. ఈ దోపిడీలలో సుమారు 6 లక్షల రూపాయిలు విలువ గల ఆస్తి నష్టమైంది. నక్సలైట్లు—అతివాద కమ్యూనిస్టులు 81 సార్లు పోలీసుల మీద కాల్పులు చేశారు. ఆ సంవత్సరంలో నక్సలైట్లు—అతివాద కమ్యూనిస్టుల వద్ద నుండి 350 ఆయుధాలు స్వాధీనం చేసుకోబడినవంటే, పరిస్థితి ఎంత తీవ్రంగా వుందో అర్థం చేసుకోవచ్చు.

శ్రీకాకుళంలోనూ, యితర జిల్లాలలోనూ నక్సలైట్లు—అతివాద కమ్యూనిస్టులు చేసిన ఘోరమైన కొన్ని హత్యా కాండల వివరాలు చూడండి.

### బోరివంకలో రెండు హత్యలు :

1969 మే, నెల 19వ తేదీ రాత్రి, శ్రీకాకుళం జిల్లాలో సముద్ర తీర ప్రాంతాన వున్న బోరివంక గ్రామంలో కృష్ణమూర్తి శర్మ అనే ఆయన యింటి మీద 100 మంది నక్సలైట్లు తుపాకులతో, బల్లాలతో, నాటు బాంబులతో దాడి చేశారు. అక్కడి గ్రామస్థుల్ని భయ భ్రాంతులుగా చేయడానికై వారు నాటు బాంబులు విసిరి గాలిలోకి తుపాకులు పేల్చారు. ఇంట్లోకి ప్రవేశించి, ఆడవాండ్లను కొట్టి, కృష్ణమూర్తి శర్మనూ, ఆయన సోదరుడు



బోరివంకలో హత్యచేయబడిన ఇద్దరు సోదరులు

వెంకటేశం శర్మనూ దారుణంగా హత్య చేశారు. ఇంటిలో వున్న ధాన్యం నిలువలూ, డబ్బూ, బంగారు నగలూ దోచుకు పోయారు. ఈ విధంగా నష్టమైన ఆస్తి విలువ సుమారు ఒక లక్ష రూపాయిలు వుంటుంది. ఈ ఇల్లు వదిలి వెళ్ళే ముందు కుర్చీలూ బెంచీలు కాలపెట్టి, దేవుళ్ళ ఫోటోలు, జాతీయ నాయకుల ఫోటోలు ముక్కలు ముక్కలుగా పగుల గొట్టి వెళ్ళారు. ఈ జంట హత్య జరిగిన తర్వాత జిల్లాలోని ఉద్దానమ్ ప్రాంతమంతటా ప్రజలు నక్సలైట్ల దారుణాలను అరికట్టడానికి ఐక్యంగా నిలిచారు.

## లోహరి జోలా దోపిడి

శ్రీకాకుళంజిల్లా లోహరిజోలా గ్రామం మీద 1969 మే 26వ తేదీ రాత్రి 600 మంది నక్సలైట్లు దాడిజరిపి అంగూరు ఇందువదన నాయుడు అనే రైతును దారుణంగా హత్య చేయడమే కాక గ్రామంలో యింకా 10 యిండ్లలో ప్రవేశించి దోపిడి చేశారు. పగలంతా పొలంలో పనిచేసి వచ్చి పాపం ఇందు వదననాయుడు మేడ మీద నిద్ర పోతున్నాడు. నక్సలైట్లు తన మీద కన్ను వేశారనీ, పగ తీర్చుకోడానికి ప్రయత్నిస్తున్నారనీ ఆయనకు తెలియదు. నక్సలైట్లు ఆయన పడక గదిలోకి ప్రవేశించి, మెట్ల మీదుగా యీడ్చుకుంటూ క్రిందికి తెచ్చి, ఆయన భార్య కండ్లారా చూస్తు వుండగా కత్తులతో, కర్రలతో ఆయన మీద చేయిచేసుకున్నారు. అప్పటికీ వారికి తృప్తి కలుగ లేదు. కత్తితో ఆయన గొంతు కోసి, భార్యను బంగారు నగలన్నీ యివ్వమని బలవంత పెట్టి తీసుకున్నారు. ఆమె చేతుల్లో పట్టుకొనివున్న పసిపిల్ల హారం కూడా వారు వదల లేదు. ఒక నక్సలైటు కార్యకర్త ఇందు వదన నాయుడి రక్తంలో చేయి ముంచి గోడమీద 5 చోట్ల అద్దాడు. గోడల మీద మావో నినాదాలు రాశాడు. ఇల్లంతా తిరిగి బంగారు నగలూ, ధాన్యం, గుడ్డలు మొదలగు వస్తువులను తీసుక వెళ్ళారు. వాటి విలువ రూపాయిలు 12,699. గ్రామంలో యింకా పది యిండ్ల మీద దాడి చేసి రూ. 34,801ల విలువ గల వస్తువులు దోచుకొని వెళ్ళారు.

## అక్కుపల్లి హత్య

1969 జూన్ 20వ తేదీ రాత్రి సుమారు 80 మంది నక్సలైట్లు అక్కుపల్లి గ్రామం మీద దాడి చేశారు. వీరిలో స్త్రీలు కూడా వున్నారు. అక్కుపల్లి గ్రామం కూడా శ్రీకాకుళం జిల్లా లోని తీర ప్రాంతం లోనిదే. నక్సలైట్లు భూచంద్ర రావు అనే ఆయన యింటిని చుట్టు ముట్టి, ఎవరైనా కలుగ జేసుకుంటే మర్యాద దక్కదని ప్రజలను భయ పెట్టారు. అప్పుడు భూచంద్ర రావు, ఆయన భార్య, తల్లీ యింట్లో నిద్రపోతున్నారు. కొందరు నక్సలైట్లు వెళ్ళి తలుపు కొట్టారు. భూచంద్ర రావు తల్లి వచ్చి తలుపు తీయగానే ఆమెను పట్టుకుని తాడుతో కిటికీ చువ్వలకు విరిచి కట్టి ఆమె వద్ద గల ఆభరణాలు ఊడ బెరుక్కున్నారు. ఈ హడా విడి విని మేడమీద గదిలో పండుకుని వున్న భూచంద్ర రావు భార్యకు మెలకువ వచ్చి క్రిందికి దిగి వచ్చింది. రాగానే ఆమెను పట్టుకుని బలవంతంగా తాడుతో మెట్లకు కట్టి వేశారు. భూచంద్రరావును భయపెట్టి బలవంతపెట్టి యినప్పెట్టె తెరిపించారు. ఆయన యినప్పెట్టె తెరుస్తున్న సమయంలోనే బల్లెంతో పొడిచి ఘోరంగా హత్య చేశారు. తరువాత యిల్లంతా గాలించి, పెట్టెలన్నీ పగుల గొట్టి, బంగారు నగలు, వెండి సామగ్రి, గుడ్డలు, యితర వస్తువులూ దోచుకు పోయారు. ఇంత చేసినా సంతృప్తి చెందక, నక్సలైటు నాయకులు ఆయన రొమ్ము మీద ఒకరి తరువాత ఒకరు బల్లెపు పోట్లు పొడిచి, కత్తితో చేతుల మీద పొడిచి, గొడలి తెచ్చి గొంతు నరికి వేశారు. తరువాత వారిలో ఒకరు నెత్తురులో చేయి ముంచి గోడలమీద ముద్రలు వేశాడు. కమ్యూనిస్టు చిహ్నమైన సుత్తీ—కొడవలి గుర్తు కూడా నెత్తురుతో గోడ మీద చిత్రించబడింది.



అక్కుపలి హత్య

## కోనాక హత్య

శ్రీకాకుళం జిల్లా తీర ప్రాంతంలో పచ్చనికొండల మధ్య ప్రశాంతమైన ఒక చిన్న గ్రామం కోనాక. అమాయకుడు కృపాసింధు సామంత రాయ్ అనేరైతు ఒకాయన వున్నాడు. ఇద్దరు ముగ్గురు జీతగాండ్లను పెట్టుకుని పొలం పనులు చేసుకుంటూ వుండే వాడు. ఆయన యిల్లు ఏకాంతంగా పొలంలోనేవుంది. అక్కడే రాత్రిళ్ళు పడుకునేవాడు. వంట మనిషి, ఒక జీతగాడు తప్ప ఆయనకుతోడు ఎవ్వరూ లేరు. 1969 జూలై 1వ తేదీన సుమారు 30 మంది నక్సలైట్లు యింటిని చుట్టుముట్టి, వంట మనిషినీ, జీతగాణ్ణి తుపాకితో కాలుస్తామని బెదిరించి ముందు భాగంలో తలుపు తెరవ డానికి ప్రయత్నించారు. తలుపు రానందున, యింటి కప్పుమీదికి ఎక్కారు. కప్పులో రంధ్రం చేసి యింట్లో ప్రవేశించి మూడు సార్లు తుపాకీ కాల్చి సామంతరాయ్‌ని హత్య చేశారు. ఒంటరిగా పొలంలోని పూరింట్లో నిద్రపోతున్న అమాయక రైతును దారుణంగా హత్య చేసిన యీ సంఘటనను గురించి విని అక్కడి ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. నక్సలైట్లు, వారి చర్యలూ, సిద్ధాంతాల పట్ల ప్రజల్లో కోపమూ, ఏవగింపూ బాగా ఎక్కువగా కలిగాయి.

### దేగల పోలూరు హత్య

దేగల పోలూరు గ్రామంలో ప్రతాప చంద్ర పథీ అంటే ప్రజలకు చాలా గౌరవం. ఆయన మామూలుగా ఒరిస్సాలోని పర్లాకిమిడిలో వుంటూ వుండే వాడు. పొలం పనుల కోసం అప్పుడప్పుడు యీ గ్రామం వస్తూవుండే వాడు. వ్యవసాయపు పనులు చూసుకునే వుద్దేశంతో 1969 జులై 18వ తేదీన ఆయన దేగల పోలూరులో వున్నాడు. ఆ రాత్రి నక్సలైట్లు ఆయన యింట్లో ప్రవేశించి, యిద్దరు పాలేరుల చేతులూ, కాళ్లూ కట్టివేసి, నోట్లో గుడ్డలు కుక్కి, కండ్లకు గంతలు కట్టేశారు. ప్రతాప చంద్రపథి వద్ద నుండి తాళంచేతులు తీసుకున్న తర్వాత ఆయన్ను పొడిచి చంపేశారు. తల నరికి తలుపు దగ్గిర వున్న స్థంభానికి వ్రేలాడ దీశారు. సుమారు రూ. 1,000ల విలువ గల వస్తు సామగ్రిని దోచుకుని వెళ్లి పోయారు.

అవివేకవంతమైన యీ ఘోర హత్యా వార్త విని ప్రజలు ఎంతో నొచ్చు కున్నారు. దుఃఖపడ్డారు. ఎందుకంటే ఆంధ్ర ప్రదేశ్‌లోనూ, ఒరిస్సాలోనూ అక్కడి ప్రజలు ఆయన మంచి తనాన్ని, ధార్మిక ప్రవర్తననూ బాగా ఎరిగిన వాళ్లు.

### ముల్లివీడు హత్య

పాలకొండ ఏజన్సీలోని పర్వత ప్రాంతంలో ప్రకృతి దృశ్యాలతో విలసిల్లుతున్న గ్రామం ముల్లివీడు. కొండల ప్రక్కగా ప్రవహిస్తున్న నాగావళినది కాలువ ద్వారా యిక్కడి వరి పొలాలకు నీటి పారుదల సౌకర్యం లభిస్తున్నది. 1969 జులై 21వ తేదీన దాదాపు 400 మంది నక్సలైట్లు అంతి కొండ పర్వతాల మీదుగా వచ్చి, గ్రామస్థులను భయ భ్రాంతులను చేసే ఉద్దేశంతో దేశవాళీ బాంబులను ప్రయోగించారు. సౌభాగ్యవంతమైన యీ గ్రామంలోని ప్రశాంత వాతావరణాన్ని అల్ల కల్లోలం చేశారు. నేతల అప్పల స్వామి నాయుడు యింటిలో బలవంతంగా ప్రవేశించారు. అప్పల స్వామి నాయుడు కొడుకు, బావాజీ నాయుడు యింటి అరుగు మీద పడుకుని వున్నాడు. అతని సోదరులు యిద్దరూ, యింట్లో వున్న స్త్రీలూ లోపల పడుకున్నారు. అప్పల స్వామి నాయుడూ, మరొక కొడుకూ, కోడలూ ఎదురింటిలో నిదురిస్తున్నారు. బావాజీ నాయుణ్ణి తుపాకితో బెదిరించి లేపి యింటిలోకి తీసుకెళ్లి బలవంతంగా యినుప పెట్టె తాళం తీయించారు. అందులోని బంగారు నగలూ, రొక్కం తీసుకొని ఆ తర్వాత నక్సలైట్లు బావాజీ నాయుణ్ణి ఆయన యిద్దరి సోదరుల సమక్షంలో పొడిచి, గొడ్డలితో నరికి చంపారు. మంగళ సూత్రాలను కూడా విడిచి పెట్టకుండా అంతా దోచుకున్నారు. ఈ ఘోరమైన హత్యాకాండ పాల కొండ తాలూకా ప్రజలలో కోపోద్రేకాలను కలిగించింది. వారంతా ఏకమై ప్రతి ఘటన దళాలుగా ఏర్పడి నక్సలైట్లు ఆ ప్రాంతంలో తిరిగి యిటువంటి సాహస చర్యలు జరపకుండా అరికట్టారు.

### బంజారాయువరాజపురంలో హత్య

ఒరిస్సా సరిహద్దులలోని మహేంద్రగిరి కొండ కోనలో దాదాపు రెండు డజనుల యిండ్లతో ఉన్న కుగ్రామం బంజారాయువరాజపురం.



శారి అప్పన్న మృతదేహం

ఆ గ్రామంలో అమాయకుడైన రైతు, శారి అప్పన్న తన కుటుంబ సభ్యులతో 'దీపావళి' పండుగ జరుపు కుంటున్నాడు. 1969 నవంబరు 9వ తేదీ రాత్రి శ్రీకాకుళం జిల్లా సోంపేట ప్రాంతానికి చెందిన నక్సలైట్లు, తామడగణపతి, పంచాడి నిర్మలల నాయకత్వాన గ్రామంపై దాడిజరిపి శారి అప్పన్నను నిర్దాక్షిణ్యంగా హత్య చేశారు. ఆయనను పొడిచి చంపి తల నరికేసి దానిని ఆయన యింటి ముందు వరండాలో వ్రేలాడ కట్టారు. ఇంటి గోడల మీద రక్తంతో నినాదాలు వ్రాశారు. రూ. 40,000 లు విలువ చేసే వస్తువులను తీసుకొని పారి పోయారు అతి భయంకర మైన యీ దారుణ హత్యను మాటలతో చెప్పడం సాధ్యంకాదు.



బంజారా యువరాజపురం హత్యాకాండ

## భావనాపురం హత్య

నక్సలైట్లు, తమ కిరాతక చర్యల స్థాయిని తామే అధిగమించారో అన్నట్లు భావనా పురంలో ఘోరాతి ఘోర కృత్యాలకు తలపడ్డారు. 1970 జనవరి 18వ తేదీన రాత్రి భావనా పురంలో నివసిస్తున్న సోంపేటకు చెందిన వోన సవరయ్యను, కొండల దగ్గిరగా పొలంలో వున్న యింట్లో ఉండగా ఎనమండుగురు సాయుధులైన నక్సలైట్లు దాడి చేసి పొడిచి చంపారు. ఆయన తలను నరికి, యింటి ముందు వెదురుగడ నాటి దానికి వ్రేలాడ దీశారు. కేవలం రూ. 500ల మొత్తం కొరకు ఆయనను హత్య చేశారు. పోలీసులు వచ్చి అజాగ్రత్తగా ఆ వెదురు గడను తీసి వేస్తారనీ ఆ సమయంలో వారు చావడం గానీ, గాయ పడడం



భావనాపురంలో....

గానీ జరగాలనే ఉద్దేశంతో వారు అక్కడ బాంబులను పాతి పెట్టారు. ఈ బెడదను అంతం చేయడానికి ప్రజలు వేల సంఖ్యలో ముందుకు వస్తున్నారంటే అందులో ఆశ్చర్య మేమీ లేదు.

ఇటువంటి కిరాతక చర్యలలో తామెక్కడ వెనుకబడి పోతామో ననే ఆదుర్దాతో అతివాద కమ్యూనిస్టులు (నాగిరెడ్డి వర్గం) తెలంగాణా ప్రాంతంలో ముఖ్యంగా ఖమ్మం, వరంగల్లు, కరీంనగర్ జిల్లాలలో యిటువంటి హింసా కాండను ప్రారంభించారు.

## పేరూరు పోలీసు స్టేషన్‌పై దాడి

1969 మే 12వ తేదీ రాత్రి పేరూరు (ఖమ్మం) పోలీసు స్టేషన్ వెనుక భాగంలో ఉన్న పోలీసు సబు ఇన్స్పెక్టరు యింటి మీద తీవ్ర వాదులు తుపాకులతో దాడి జరిపి, ఎస్. ఐ. యింటి వరండాలో నిద్రిస్తున్న కొందరు వ్యక్తుల పై కాల్పులు జరిపారు. ఎస్. ఐ. నీ, హెడు కానిస్టేబిల్‌నీ చంపాలనే ఉదేశంతో యీ దాడి జరిపారు. అయితే వారు అక్కడ లేనందున అక్కడ నిద్ర పోవడానికి వచ్చిన అమాయకులైన యిద్దరు వ్యక్తులు మరణించారు.

## హోంగార్డ్ హత్య

వరంగల్లు జిల్లాలో ధర్మారావు పేటలోని గ్రామ రక్షణ వాలంటీర్ దళాల శిక్షణ శిబిరంపై 1969 సెప్టెంబరు 13వ తేదీ రాత్రి తీవ్ర వాదులు దాడి జరిపి శిక్షణ బృందం బస చేస్తున్న పాఠశాల భవనంపై మూడు నాటు బాంబులు విసిరారు. అదేసమయంలో పాఠశాల భవనం మీద తుపాకులతో కాల్పులు చేశారు. లాంతరు తీసుకొని పాఠశాల భవనం యీవలికి వచ్చిన ఒక హోంగార్డ్‌ను కాల్చి చంపారు. పోలీసులు తిరిగి కాల్పులు జరపగా తీవ్ర వాదులు కాలికి బుద్ధి చెప్పారు.

## ములుగు తాలూకాలో రెండు హత్యలు

1969 అక్టోబరు 28వ తేదీ రాత్రి ఒక తీవ్ర వాదుల ముఠా, వరంగల్లు జిల్లా గోవిందరావు పేటకు చెందిన పోలీసు పటేలు, రఘునాథ రావు యింటి మీద దాడి జరిపి అతన్ని కాల్చి చంపారు. అదే ముఠా ప్రక్క గ్రామమైన పస్రాకువెల్లి స్థానిక వ్యాపారి సుభాన్ సేట్ యింటిపై దాడి జరిపారు. ఇంటిని చెల్లా చెదరు చేసి సుభాన్ సేట్‌పై కాల్పులు జరిపి తీవ్రంగా గాయ పర్చారు. తర్వాత అతను చనిపోయాడు.

## మహదేవ పూర్ ప్రాంతంలో పోలీసు పటేలు హత్య

1969 డిసెంబరు 28వ తేదీన కరీంనగర్ జిల్లా, పంకెన గ్రామం పోలీసు పటేలు, ఆజంఖాన్ బండిలో కనుకనూరు నుండి పంకెన గ్రామానికి వెళ్తుండగా సాయుధులైన తీవ్ర వాదులు తుపాకుల్తో అడ్డగించి బలవంతంగా అతనిని ఎత్తుక పోయారు. 1969 డిసెంబరు 30వ తేదీన సమీపంలోని కాలువలో గాయాలతో ఆజంఖాన్ శవం కనిపించింది.

పోలీసులు తీవ్రమైన చర్యలు తీసుకున్న ఫలితంగా నక్సలైట్లు, తీవ్ర వాదులు కల్పించిన అశాంతి వాతావరణాలు తొలగి శాంతి భద్రతల పరిస్థితి మెరుగు పడుతున్నది. ప్రత్యేక కేసుల సందర్భంలోనూ, ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టము, యిటీవలి ఆర్డినెన్సుల క్రింద ముఖ్యులైన నక్సలైట్లనూ తీవ్ర వాదులనూ అరెస్టు చేయడంతో పరిస్థితులు చాలావరకు మెరుగు పడినాయి. శ్రీకాకుళం ప్రాంతంలో అధిక సంఖ్యలో గిరిజనులు నక్సలైట్ల కార్యక్రమాలకు విముఖత వ్యక్తం చేస్తున్నారు.

పోలీసుల సన్నిహిత సహకారంతో రెవిన్యూ శాఖ, గిరిజన సంక్షేమ శాఖలు నిర్వహిస్తున్న ఉచిత భోజనశాలలకు శ్రీకాకుళానికి చెందిన గిరిజనులు అధిక సంఖ్యలో వస్తున్నారు. ఇది కాక వేలాది కుటుంబాలలో భూమి లేని వారికి పట్టాలు యివ్వడం, గుడ్డలు, వైద్య సౌకర్యాలు కలుగ జేయడం కూడా జరుగు తున్నది. ✦



## స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగు కవిత

ఇది జనధర్మ పత్రిక ద్వైమాసిక సాహిత్యానుబంధ సంచికలలో ఆరవది. వెల : 3 రూ॥లు. గౌరవ సంపాదకులు డాక్టర్ సుప్రసన్న. భారత దేశానికి 1947లో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తెనుగు కవిత్వంలో వచ్చిన మార్పులను వివరంగా పరిశీలించడానికీ ఇప్పటి తెలుగు కవితా విధానానికి ఒక నిర్వచనం ఇవ్వడానికీ యీ సంచికలో సమగ్రమైన కృషి జరిగింది. డాక్టర్ సుప్రసన్న, సంపత్కుమార, మాదిరాజు రంగారావు, యం. రామకృష్ణారావు, అద్దేపల్లి రామ్మోహన్‌రావు, కుందుర్తి, కేతవరపు రామకోటి శాస్త్రి, వరవరరావు ప్రభృతులు వివిధ విషయాలపై విమర్శనాత్మకమైన, సమగ్రమైన పరిశీలన వ్యాసాలు వ్రాశారు. మొత్తముమీదచూస్తే అభ్యుదయ కవితాయుగం 1955తో అంతమైనదని, అక్కడనుండి ప్రగతి వాదోత్తర కవితాయుగం అని పేర్కొనదగిన వచన కవితోద్యమమం ఆరంభమైనదని వ్యాసకర్తలు అభిప్రాయపడినట్లు కనిపిస్తున్నది. వర్తమాన వచన కవితోద్యమానికి మూలభావన అభ్యుదయ కవితకువలె మార్క్సిజం కాదనీ, ఇప్పుడు భారతీయ భావన, ప్రజాస్వామ్యం, వ్యక్తి సర్వతోముఖ వికాసం, ఆధునిక భావ చేతన, నేటి కవితలోని ప్రధాన తత్వాలనీ డా॥ సుప్రసన్న ప్రతిపాదించారు. ప్రముఖులైన అభ్యుదయ కవులు వాడిన శబ్దాలను, భావనలను ఉదహరిస్తూ వారిపై సంప్రదాయ ముద్ర ఎంత గాఢముగానున్నదో రామకోటి శాస్త్రిగారు చూపారు. ఇదే విషయం గురించి సంపత్కుమార వ్రాస్తూ "ఏవో కొన్ని పదాల ప్రయోగాన్నిబట్టి, అంశాలనుబట్టి ప్రగతివాద కవిత్వంపై సంప్రదాయ ముద్రవున్నట్లుగా చెప్పడానికి అవకాశం లేకపోలేదు. కాని ఆ ప్రయోగాలు మొదలగునవి ప్రగతి దృక్పథానికి అనుగుణంగా మలచబడిందన్న విషయం గమనించవలసి యున్నది ...... కేవలం కొన్ని పదాల ప్రయోగం బట్టి సంప్రదాయ ముద్రను ప్రభావాన్ని నిర్ధారితంచేయటం కష్టం" అని అన్నారు. ఈ అభిప్రాయమే చాలా వరకు సరియైనదిగా కనిపిస్తుంది. 1955_56 ప్రాంతంలో ప్రగతి వాదంపై తిరుగుబాటు జరిగినట్లు ఆయన తన వ్యాసంలో పేర్కొన్నాడు.

విశ్వనాథ, శ్రీశ్రీలవి రెండు విభిన్న మార్గాలనీ ఈ రెండూ విజయం పొందినవనే అభిప్రాయం ప్రకటించబడింది. విశ్వనాథ మార్గం నూటికి నూరుపాళ్ల పూర్వకవితా సంప్రదాయమార్గము. ఆయన తన మహా ప్రతిభ వల్ల హిమాలయోన్నతుడుగా నిలిచినాడన్నది నిజమే. కాని ఆయన మార్గం విజయము పొందినదనుట సందేహము. నేటి కాలములో రాస్తున్న వేలాది యువకవులు తమకు వీలైనంత సంప్రదాయ భిన్న మార్గమును అనుసరించి ఉండటమే దీనికి నిదర్శనం. శ్రీశ్రీ విషయంలో పరిస్థితి వేరు. ఆయన నిలిచినా నిలవక పోయినా ఆయన మార్గం నిలుస్తుంది. ఎందుకంటే అది మార్పును అంగీకరించే మార్గము. నేటి వచన గేయాలను వచనంగా అచ్చువేస్తే సరిపోతుందని "హిమభద్ర" సూచించారు. ఇది ఇంకా పరిశీలన చేయవలసిన సమస్య. తొందర పాటుతో నిర్ణయం చేయకూడని సమస్య. భావనలో నిరాశ, అసంతృప్తి, శైలిలో అయోమయ పరిస్థితి మొదలగు వాటిని కుందుర్తి తన వ్యాసంలో నిరసించారు. వచన కవిత్వం తెనుగు ప్రజల సహజ సంభాషణ స్థాయికి రావాలని ఆయన ప్రతిపాదించారు. శ్రీ అద్దేపల్లి తమ వ్యాసంలో ఇటీవలి యువకవుల ప్రతిభావిశేషాలను పరిశీలించారు. యం. రామకృష్ణారావు స్వాతంత్ర్యానంతర కవిత్వంలో మార్క్సిజం స్థానే జాతీయ భావాలు యే విధంగా ప్రాధాన్యం వహించాయో సోదాహరణంగా నిరూపించారు.

స్వాతంత్ర్యోత్తర కాలాన తెనుగు కవిత అంటే ప్రధానంగా నేటి వచన కవితా వికాసమే అవుతుంది. సమగ్రమైన పరిశీలక వ్యాసాలతోకూడిన ఈ సంచిక ప్రతివారు తప్పని సరిగా చదవదగినది.

## శ్రీశ్రీ సాహిత్య సమాలోచన : సృజన

మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా 172 పేజీలతో సృజన 14వ సంచికను శ్రీశ్రీ సాహిత్య సమాలోచన ప్రత్యేక సంచికగా వెలువరించారు. సంచిక వెల: 1_50 పై. ఇందులో ప్రఖ్యాత విమర్శకులు కె. వి. రమణారెడ్డి, కొడవటిగంటి, అద్దేపల్లి, రోణంకి, నూతలపాటి గంగాధరం, మార్క్స్, నవీన్, యస్. వి యస్. రావు, ఎ బి.కె. ప్రసాద్, వరవరరావు, చేకూరి రామారావు ప్రభృతులు బహుముఖ ప్రజ్ఞావంతుడైన శ్రీశ్రీని వివిధ కోణాలలో దర్శించారు. శ్రీశ్రీ రాజకీయ దృక్పథం, వ్యక్తిత్వం వచన రచనా పాటవం, అనువాద ప్రతిభ, యుగకర్తృత్వం, విమర్శనా శక్తి, నాటికా రచన మొదలగు అనేక విషయాలను గురించి ప్రత్యేకమైన వ్యాసాలు ఈ సంచికలో వున్నాయి శ్రీశ్రీని గురించి ఎంత తెలిసినవారికైనా ఇంకా తెలుసుకోవలసిన విషయాలు అనేకం వ్యాసకర్తలు సూచించారు. ఈ సంచికలో ప్రత్యేక ఆకర్షణ శ్రీశ్రీతో ఇటీవల 20 మంది యువకవులు జరిపిన గోష్ఠి వివరాలు ప్రచురించడం. ఇదికాక నవీన్, శ్రీపతి, వరవరరావులు ప్రత్యేకంగా జరిపిన ఇంటర్వ్యూ వివరాలు కూడా ప్రకటించబడినై. ప్రశ్నోత్తరాల రూపంలో జరిగిన యీ గోష్ఠి వివరాలు శ్రీశ్రీ యొక్క ఇప్పటి ఊహలను, విశ్వాసాలను, స్పష్టంగా తెలియజేస్తున్నాయి. శ్రీశ్రీ నాటినుండి నేటివరకూ నూటికి నూరుపాళ్ల విప్లవకవి. సంఘంలో మార్పుకోసం మార్క్సిస్టు సిద్ధాంతాలననుసరించి జరిగే విప్లవ పోరాటాలను ఆయన అరమరిక లేకుండా సమర్థిస్తాడు. ఆర్థిక స్వాతంత్ర్యం విప్లవంద్వారానే సాధ్యమని, సంస్కరణల ద్వారా సాధ్యం కాదని శ్రీశ్రీకి గాఢమైన విశ్వాసం వున్నది. వర్గ సమాజంలో కవి అందర్నీ సమానంగా చూడటానికి వీలులేదని పీడితవర్గంవైపు మొగ్గక తప్పదని ఆయన నమ్మకం. "అలజడి మా జీవితం, ఆందోళన మా వూపిరి"అన్న శ్రీశ్రీయే అదే

రూపంలో ఈ గోష్టిలో కూడా దర్శనమిస్తాడు. తెనుగు సాహిత్యంలో విమర్శ, పార్లమెంటరీ డెమోక్రసీ, కవులు సినిమాలకు అమ్ముడు పోవడం, సాహిత్యంలో అశ్లీల పదజాలం, సాయుధ విప్లవం, దిగంబర కవులు, గాంధీజీ వ్యక్తిత్వం, సాహిత్యంలో రాజకీయాలు, తెలుగు నాటక రంగం, క్రిమశిక్షణ, వచన కవితా ఉద్యమం మొదగు వందలాది విషయాలమీద శ్రీశ్రీ తన అభిప్రాయాలను విస్పష్టంగా ప్రకటించాడు. శ్రీశ్రీది ప్రధానంగా శబ్దాశ్రియమైన రచనా పద్ధతియని వివరిస్తూ శబ్దలయతో శ్రీశ్రీ భావచిత్రాలు కట్టినాడని, యే శబ్దానికి ఆ శబ్దం విడదీసి చూస్తున్నప్పుడు స్ఫురించని భావం శబ్దాల విన్యాసంవల్ల స్ఫురిస్తుందని రమణారెడ్డిగారు తమ వ్యాసంలో పేర్కొన్నారు.

శ్రీశ్రీ కి శబ్దంమీద అధికారం వున్నట్లే, శ్రీశ్రీ మీద శబ్దానికి అధికారం వున్నదని చెప్తూ శబ్దమైత్రివుంది. అర్థపుష్టిలేని రచనలనుకొన్ని ఆయన ఉదహరించాడు. శ్రీశ్రీ కవిత్వం మీద రమణారెడ్డిగారి వ్యాసం సమగ్రంగావుంది. నిష్పాక్షికంగావుంది. "ఒక చారిత్రక దశలో సమాజంకవిన గొప్పకలమ శక్తిగల అక్షరాలలో విలిపి, "తలలో ప్రజల నాలుకైన శ్రీశ్రీ"కి ఆయన జోహారు లర్పించారు. శ్రీశ్రీ వచన రచనలోని శైలి, ఆశయాలు, ఛలోక్తులు, సూక్తులు, తాత్విక చింతన మొదలగు వాటిని గురించి కొడవగంటి కుటుంబరావు వివరించారు. శ్రీశ్రీ నాటికల గురించి రోణంకి అప్పలస్వామి, రాజకీయ దృక్పథం గురించి మార్క్స్, రాసిన వ్యాసాలు సమగ్రమైన పరిశీలనతో కూడుకుని వున్నవి. గురుజాడ వారసుడుగా శ్రీశ్రీ కి గల స్థానాన్ని నవీన్, "వ్యక్తిగా శ్రీశ్రీ" అనే విషయం గురించి వరవరరావుగార్లు రాసిన వ్యాసాలు చదువదగినవి. శ్రీశ్రీ గురించి ఇంతవివరంగా సమాలోచన జరిపిన ప్రత్యేక సంచికగానీ, గ్రంథంగానీ లేదనే చెప్పవచ్చును. కవితలో సామాజిక దృక్పథం గల ప్రతి యువకవి తప్పక చదువదగిన సంచిక.

## కళాకేళి : శ్రీ శ్రీ షష్టిపూర్తి అభినందన సంచిక

సంపాదకులు : సోమసుందర్. వెల రు 1_60 పై. పేజీలు 100
ప్రతులకు కళాకేళి, గాంధీనగర్, కాకినాడ.

కళాకేళి 2 వ సంపుటి 10, 11 సంచికలు కలిసి శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా ప్రత్యేక సంచిక విడుదల చేశారు, ఇతర ప్రత్యేక సంచికలకూ దీనికీగల ప్రధాన భేదం, దీనిలో శ్రీశ్రీని గురించిన అభినందన కవితలు ఎక్కువగా వున్నాయి. సోమసుందర్, దాశరథి, నారాయణరెడ్డి, ఆర్. కె. మొగపాటి, యం. ఆర్. నరసింహారావు కె. శివారెడ్డి, డా. యస్. వి. యన్ రావు, శశికాంత శాతకర్ణి, గంధం జోయెల్, బసవరాజు ప్రభృతులు శ్రీశ్రీకి షష్టిపూర్తి సందర్భంగా కవితానీరాజనం అర్పించారు. ఇస్మాయిల్, మిరియాల రామకృష్ణ, డా. కేతవరపు, పురిపండా రోణంకి, కె. వి. రమణారెడ్డి ప్రభృతులు వ్యాసాలు రాశారు. శ్రీ రమణారెడ్డి తమ వ్యాసంలో "చరిత్ర గతితోటి ఏకీభావాన్ని పొందడం ఒకటి, దానితోతాదాత్మ్యాన్ని పొందడం యింకొకటి. ఈ రెండోది రచనలకు పాక్షికమైన వక్రతను తెచ్చిపెడుతుంది. కవిని రాజకీయ నాయకునికి పర్యాయపదం చేసివేస్తుంది" అని వ్యాఖ్యానించి పౌర జీవితంలో పాల్గొంటూ కూడా కవిత్వ జీవితాన్ని సంపుష్టం చేసుకోగల అవకాశాన్ని శ్రీశ్రీ సరిగా వినియోగించుకో లేదని అన్నారు.

డా. రామకోటిశాస్త్రి "మహాప్రస్థానం" అనే శీర్షికపై వ్యాఖ్యానిస్తూ, "శ్రీశ్రీ ఎంత ముందుకు చూడగలడో అంత వెనుకకును చూడగలడు" అని శ్రీశ్రీ లోని సంప్రదాయజ్ఞతను వివరించారు. విప్లవం గురించి శ్రీశ్రీకి గల వ్యక్తిగత అభిప్రాయాలను సంపాదకీయంలో విమర్శించారు. మొత్తంమీద శ్రీశ్రీ సాహిత్య పరిశీలనాపేక్షగల వారికి యీసంచిక ఎంతో ఉపయోగపడుతుంది.

## 'ఇందూరు భారతి' ప్రథమ వార్షికోత్సవ సంచిక

నిజామాబాద్ జిల్లా తెనుగు రచయితల సమాఖ్యే ఇందూరు భారతి. రచయితలోని సృజనాత్మక శక్తినీ, ప్రతిభనూ ఉత్తేజపరచడం, జిల్లాలో సాహితీ సంచలనం, సాంస్కృతిక వికాసం కలిగించడం మొదలగునవి యీ సంస్థ ఆశయాలు.

పేరు వార్షికోత్సవ సంచికగా వున్నా యిది ఒక చిన్న కవితా సంకలనంగా ప్రకటించారు. ఇందులో ఇరవైమంది యువ కవుల రచనలు వున్నాయి. కథలూ వున్నాయి. శ్రీ ఎ. సూర్యప్రకాశ్ రాసిన "బాపూజీకి లేఖ" అనే గేయం, గాంధీజీని చూడని నేటి యువతరంలో, తమ చుట్టూ వున్న పరిస్థితుల పట్లగల అసంతృప్తిని చక్కగా ప్రకటిస్తున్నది. శ్రీసైబ పరంధాములు రచన "దీపం వెలిగించాను" బాగుంది. దాదాపు అన్ని గేయాలూ, కవితా సంకలనంగా వేస్తే బావుండేదేమోనని అనిపించేస్థాయిలో వున్నాయి. తెలంగాణాలో నేడు బాగా వ్యాప్తి చెందుతున్న వచన కవితోద్యమానికి యీ సంచిక ఒక ఉదాహరణ. కీ, శే. తిలక్ రచవనుండి ఉద్ధృతమైన భాగము, కుందుర్తి సందేశమూ వున్నాయి. సహకరించిన వారందరికీ "షష్ఠ్యంతములు" రూపంలో కృతజ్ఞతలు తెలుపడం బాగుంది.

## స్వీకారం :

*గాంధీజీ సంక్షిప్త జీవిత చరిత్ర :* సంకలన, శ్రీ అల్లంరాజు సత్యనారాయణ రావు, సాహితీ సమాఖ్య, కాకినాడ.

*నెహ్రూ వీలునామా :* శ్రీమతి వల్లభనేని రంగనాయకమ్మ స్మారక ప్రచురణ, ఏలూరు.

*ప్రముఖ పారిశ్రామికవేత్తలు :* (ఒకటి) ప్రజా ప్రచురణలు, ఏలూరు. శ్రీ వెలగపూడి రామ కృష్ణ (ఐ. ఎ. ఎస్) గారి జీవిత చరిత్ర.

*విద్యుల్లత :* యువ సాహిత్య మాస పత్రిక 3 వ సంచిక నిర్వహణ : సాహితీ మిత్ర మండలి, కరీంనగర్.

*వినాకిని ;* 3 వ సంచిక. నెల్లూరు జిల్లా అభ్యుదయ మాస పత్రిక. జిల్లా స్థాయిలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలకు దర్పణం. జాతీయ పునర్ నిర్మాణ కార్యక్రమాల్లో ప్రజలను భాగస్వాములుగా చేయాలనే సంకల్పంతో వారిలో చైతన్యం కల్గించడానికి జిల్లా స్థాయిలో యిట్టి కృషి జరగడం ప్రశంసనీయం.

★

—చైతన్య

CE-17/68 tel



# బంగారము వంటి పంటలు పండించుకొంటె
# అవి మీ సిరిసంపదలకు శ్రీరామ రక్ష
# మీ పంట భూములు పచ్చగా ఉన్నాయంటే
# అది కూపర్ డీసెల్ పంపుసెట్టు పెట్టిన భిక్ష





# కూపర్
## డీసెల్ పంపుసెట్లు




పంటలు సమృద్ధిగా పండుతే, మీ చేతినిండా డబ్బు ఉంటుంది. మీ భూములకు కూపర్ డీసెల్ పంపుసెట్టుతో నీరు పెట్టుకొంటే మీ యిల్లు నిత్య కళ్యాణము పచ్చ తోరణముగా ఉంటుంది.

ప్రత్యేక లాభములు ● పొదుపు—తక్కువ నూనె ఖర్చు ● హెచ్చు పని—నిమిషమునకు హెచ్చు గాలనుల నీరు ● తేలికైనది—తీసుకొని పోవుట సులభము ● పెట్టుబడి తక్కువ—మామూలు డీసెల్ పంపుసెట్ల కన్న తక్కువ ఖర్చు.

**కూపర్ ఇంజనీరింగ్ లిమిటెడ్**

# గృహిణి

పిలకా గణపతిశాస్త్రి

## జరిగిన కథ

పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ఏలూరులో ఒకసారి శ్రీకృష్ణ తులాభారం వేద్దామని బ్రహ్మాండంగా ఏర్పాటు చేసుకున్నాడు. ఆ నాటకంలో హీరోయిన్ వేషంవేసే సరోజకు సినిమాలో ఛాన్సు దొరకడంవల్ల ఆమె రావడం పడలేదు. నాటకం అభాసైంది. ఆమెను వెంట బెట్టుకుని వద్దామని పార్థసారథి మద్రాసు వెళ్ళాడు. అక్కడ సరోజ మేనమామతో ఘర్షణపడ్డాడు. మనసంతా వికలమైంది. జ్వరంతో కదలలేకుండావున్న అతన్ని అతని బంధువు కృష్ణమూర్తి, యింటికి చేరవేశాడు. చావు బ్రతుకుల్లో కొన్నిరోజులు కొట్టుకొని చివరకు తేరుకున్నాడు పార్థసారథి. ఏలూరు నించి నాటకం కంట్రాక్టరు గుప్త ఉత్తరం రాశాడు. బ్యాంకిలోనించి కొంతసొమ్ము తీసి గుప్తకు మనియార్డరు పంపించాడు ప్రభాటాకీస్ కొనుక్కోవలసినదని రామ సుబ్బయ్య కబురు పంపాడు. ప్రభాటాకీస్ కొనాలని నిశ్చయించుకొని, తానిక రంగస్థలంమీద అడుగు పెట్టదలచుకోలేదని నటీనటులందరికి చెప్పివేశాడు.

విజయలక్ష్మి ఇల్లంతా శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టింది. ప్రత్యేకించి అమ్మవారి పూజా గదిని మామిడి తోరణాలతో అలంకరించింది. కృష్ణమూర్తికి, సావిత్రికి వర్ధనమ్మ చేత తలంటి నీళ్ల పోయించింది. పిల్లలందరికి తలంటి నీళ్ళు పోసి తానుకూడా తలంటుకున్నది. ఆ తర్వాత పార్థసారథినికూడా అభ్యంగన స్నానానికి ఆహ్వానించింది.

'ఇదేమిటీ హడావిడి అంతా?' పార్థసారథి బాగా విస్తుపోయి అడిగాడు.

"త్వరగా లేచి రండి! తరువాత చెబుతాను." విజయలక్ష్మి అధికారపూర్వకంగా ఆహ్వానించింది. ఒకవేళ ఆరోగ్య స్నానం చేయిస్తున్నదేమోనని అనుకున్నాడు మరి కాదనలేక వట్టి పసిపిల్లవాడిలాగ తలంటి నీళ్ల పోయించుకున్నాడు, ఆ తరవాత విజయలక్ష్మి ఇంటి లిపాదికి నూతన వస్త్రాలు బహూకరించింది. పిల్లలిద్దరికి కొత్త దుస్తులు తొడిగింది. పార్థసారథికికూడా కట్టుకోవలసినదని నూతన వస్త్రాలందించింది!

"ఏమిటి ఈ హంగామా అంతా. ఈ నాటకం కట్టిపెట్టి అసలు కథేమిటో కాస్త నాతో చెబుదూ?" పార్థసారథి నవ్వుతూ బ్రతిమాలుతున్నాడు.

"ఇందులో నాటకమేమీ లేదు! అంతా నిజమే. ఈ వేళ మీరు పుట్టిన రోజు!"

ఆమె చిరునవ్వు చిలకరిస్తూ సమాధానం చెప్పింది. పట్టరాని ఆశ్చర్యం పార్థసారధి కళ్ళలో పరవళ్ళు తొక్కింది. ఇన్నాళ్ళనించి తానామె పుట్టిన రోజు మాట తలపెట్టలేదు! ఇంట్లో ఎన్నెన్ని పనుల గొడవలలో పడి సతమతమవుతున్నా, ఆమె తన జన్మ దిన సంగతి ఎన్నడు మరచిపోలేదు! విజయలక్ష్మి ముఖంలో ఎంతటి అతిలోకమయిన ఆత్మీయత, మాధుర్యము, ప్రేమార్ద్రత తొణికిసలాడుతున్నాయి! ఇంతకు మునుపు ఆమెలో లోపలి ప్రగాఢాత్మీయత అవగతమయినా తానెందుకు అవగాహన చేసుకోలేక పోయాడు! ఎందుచేత తన దృష్టికంతటి దట్టమయినా అజ్ఞానపు పొర కమ్ముకుపోయింది! తన హృదయంలో ఎంతటి విపరీత వ్యామోహ విషం పేరుకున్నది! వట్టి గాజుపూస సరోజ అమూల్యమయిన మాణిక్యమని భ్రమించాడు. నట్టింట పారాడుతున్న పైడి పెన్నిధి వట్టి నత్తగుల్ల అన్నట్టు కొట్టి పారవేసి ఉపేక్షించాడు. ఇంత కాలంనించి కలసిమెలసి ఉంటున్నా తన గృహిణి అంతరాంతరాలలో ఆత్మీయమయిన అనురక్తి మాధురి అవంతయినా అవగాహన చేసుకోలేకపోయాడు. ఎంతటి గుండె దిటవుతో, ఓరిమితో, ఆదరణతో, ఆప్యాయతతో తాను చేసిన వన్ని సహించి భరించింది. అయినా తను నాటకానికి సౌఖ్యానికి, చీటికి మాటికి అడ్డుపడుతున్నానని కస్సు బుస్సుమని చీదరించుకుని అనేక విధాల అవమానించి హింసించాడు. అయినా తన ప్రాణాపాయ సమయంలో ఆత్మాభిమానం అంతా చంపుకుని ఒక్క మారు చూసి వెళ్ళవలసినదన్ని సరోజవంటి వ్యక్తిని బ్రతిమాలుకుని ప్రాధేయపడింది. ఆ తరవాత ఆమే

అయినట్లు నటించింది. అంతటి అనురాగమూర్తిని అంతకు మునుపు తానెందుచేత అవంతయినా అవగాహన చేసుకోలేక పోయాడు. ఎంతటి సన్నిహితులనయినా ఒక్కొక్కప్పుడు మనస్సు పొరలలో అజ్ఞాతంగా ఎన్నెన్నో అడ్డు గోడలులేచి స్థిర పడిపోతాయని ఆ సమయంలో అతనికి అకస్మాత్తుగా స్ఫురించింది.

ఆ నాడు విజయలక్ష్మి సరిగంచు లేత నెమలి పచ్చ పట్టు చీర కట్టుకొన్నది. దాని మీద రవంత ముదురు ఊదా రంగు రవిక తొడుక్కున్నది. పాదాలకు పసుపు పూసుకుని పారాణి పెట్టు కున్నది. వదులు జడతో మలుచుకొన్న సిగలో దేవ కాంచన పూల మాలిక తురుముకొన్నది. అభ్యంగన స్నానంతో జీరాడు తున్న ముంగురు తో, లేత పసుపు పూలతో కలకలలాడుతున్న ముఖం మీద చిన్న కుంకుమ తిలకం సరిదిద్దుకొన్నది. చెక్కిళ్ళ మీద ఎర్రరాళ్ళతోబాటు బంగారు దుద్దుల జత తళతళలాడు తున్నది మెడలో ముప్పేట చంద్రహారం మంగళసూత్రాల జంట వేలాడగట్టిన గొలుసుతో మేళవించి చిక్కగా చిక్కుపడింది. ముంజేతులమీద పట్టుతోరాలపై పైడి గాజులటు ఇటు కదలాడు తున్నాయి కాళ్ళ మీద కడియాలతోబాటు చిరుమువ్వల వెండి పటీలు చక్కని పిండి ముగ్గులలాగ మెరుస్తూ ఆమె అటు ఇటు పొరాడినప్పుడు గల్లు గల్లుమని ధ్వనిస్తూ చంగలిస్తున్నాయి. పట్ట రాని ప్రేమోల్లాసం చిరునవ్వై చెంగలించి బుగ్గలమీద చిన్నారి సొట్టలలో సుడులు తిరుగుతున్నది.

పార్థసారథి అపూర్వమయిన విజయలక్ష్మి సౌందర్యానికెంతో ఆశ్చర్యపడి రెప్పపాటు లేకుండా ఆమెవైపు చూస్తూ అయిదారు క్షణాలపాటు అలాగే నిలుచుండిపోయాడు: తన గృహలక్ష్మి రూపం ధరించిన పరిపూర్ణమయిన ఆత్మీయతతో, అనురక్తితో స్నేహమాధు రితో సమక్షంలో సాక్షాత్కరించినదని అతనికాక్షణంలోస్ఫురించింది. అంతేకాదు ! ఆ స్ఫూర్తివల్ల తానదే నిమిషంలో ప్రపంచంలో సరికొత్తగా జన్మించినట్టు భావించుకొని అంతర్యంలో ఎంతయిన ఉప్పొంగిపోయాడు: విజయలక్ష్మి అతని చేయి పట్టుకుని నెమ్మదిగా లోపలికి తీసుకు వెళ్లింది !

"ఎక్కడికిలాగ తీసుకువెడుతున్నావు ?"

నిశ్చల నేత్రాలతో ఆమె వైఖరి పరిశీలిస్తూ బాగా పర ధ్యానంగా అడిగాడు.

"అమ్మగారి పూజ గదిలోకి వెళ్లి ఒక్క నమస్కారం పెట్టి వద్దురుగాని రండి! ఆ చల్లని తల్లి దయ వల్లనేకదా మీరీ గండాలన్నీ గడిచి బయటపడ్డారు! తలవనితలంపుగా ఆ ప్రభా టాకీస్ బేరంకూడా ఆవిడ చలవ వల్లనే చాలా చవకగా కుదిరింది.

పార్థసారథికెన్నడు దైవంమీద అంతటి భక్తిగాని, అశ్ర ద్ధగాని కలగలేదు. అలాగని అతడు నాస్తికుడు కాడు. సామా న్యంగా అందరిలాగే కొద్దిపాటి భక్తి శ్రద్ధలతో ఇంట్లో జరిగే పూజా పునస్కారాలలో పాల్గొన్నాడు. అంతే, మొత్తంమీద అతనికి అలాంటి చాదస్తాలంటేగిట్టవు. విజయలక్ష్మి బలవంతం చేస్తున్నది కనుక కాదనలేక కాళ్లీడ్చుకుంటూ వెంట వెళ్ళాడు.

ఎదురుగా పూజాగృహం సాంబ్రాణి పొగతో అగరుధూమ పరిమళంతో ఘుమఘుమ లాడుతున్నది. కాశీరత్నాలు, కరవీరాలు నందివర్ధనాలు మొదలయిన పూలమాలికలమధ్య అమ్మవారి ముఖం స్పష్టాస్పష్టంగా గోచరిస్తున్నది. విగ్రహాని కిరువైపుల పొడవ యిన సెమ్మెలలో చిరుదీపాల మల్లెమొగ్గలై వికసించాయి. పీఠానికెదురుగా ప్రమిదలలో చిన్న చిన్న దీపికల పంక్తులు మిను కు మినుకుమని మెరుస్తున్నాయి. రంగురంగుల రంగవల్లికలలో వివిధ పూజా ద్రవ్యాలమధ్య మహాలక్ష్మి దేవతాపీఠం జ్యాజ్జల్య మానంగా వెలిగిపోతున్నది. అదే తరుణంలో కృష్ణమూర్తి దంపతు లు వర్ధనమ్మ అక్కడికివచ్చి వారికనతి దూరంగా నిలుచున్నారు.

పార్థసారథి భార్య పూజ గది అలంకరించిన తీరు ఎంతో చక్కగా ఉన్నదని మెచ్చుకున్నాడు. అయితే అంటీఅంటనట్టు ఒక్క నమస్కారం పెట్టాడు.

'అలాగ వంక దణ్ణం పెడితే చాలదు! సాష్టాంగ నమ స్కారం చెయ్యాలి.'

భార్య అధికార పూర్వకంగా పట్టుపట్టింది.

'ఏమిటి విజయా; నీకింత చాదస్తం! ఇంత వరకు కాసిని కాఫీ నీళ్లయినా నా గొంతుకులో పోసుకోనివ్వావు కాదు! కాస్త నన్ను వెళ్ళనివ్వు !

'కాఫీ కేం! సాష్టాంగ నమస్కారం చేశాక కావలిసినంత పుచ్చుకుందురుగాని! ముందు నేను చెప్పినట్టు చెయ్యండి! అమ్మవారి చలవవల్లనే మీకు పుట్టెడు రోగంవచ్చి నిమ్మళించింది! ఈ గడియ కిలాగ అందరం నింపాదిగా ఉన్నాము !"

అయితే అతని ఆలోచన ఎన్నడు దైవం వైపు పోలేదు ! తన జబ్బు నిమ్మళించడానికి డాక్టర్ల ఇద్దరి వైద్యము, భార్య నిరంతర పతిచర్య. కొంతవరకు కృష్ణమూర్తి దంపతుల ఆసరా ప్రధాన కారణాలని అనుకున్నాడు. అదేమాట నవ్వుతూ ఆమెతో చెప్పి చప్పరించేశాడు.

'ఏమిటో నీ వన్నీ వట్టి పిచ్చినమ్మకాలు విజయా ! అమ్మవారి దయలేదనడంలేదు నేను ! కాని డాక్టర్లిద్దరు కష్టపడి వైద్యం చెయ్యక పోతే రోగం నిమ్మళిస్తుందా? పోనీ, నువ్వు చెప్పినట్టే ఓ నమస్కారం పెట్టానుగా ! మరి నన్ను వెళ్లనీ !

'ఆమె డాక్టర్ల సహాయం కాదనలేదు ! అయితే అమ్మవారి దయలేపోతే ఎంతెంతటి వైద్యులయినా ఏమి చెయ్యలేరని వాదించింది. పార్థసారథి తిరిగి వెళ్లబోతుంటే తన చేతి పట్టు విడిచి పెట్టకుండా గట్టిగా అదిమిపట్టుకుని సాష్టాంగ నమస్కారం చెయ్యక పోవడం తప్పని హెచ్చరించింది.

'నా మాట తప్పనని మాట ఇచ్చారు అప్పుడే మరచి పోయారా ?'

వర్ధనమ్మ కృష్ణమూర్తి కూడా సాష్టాంగ నమస్కారం చెయ్యకుండా వెళ్లిపోవడం చాలా తప్పని వంతపాడారు. విజయ

లక్ష్మి ఇలువేలుపు పార్శ్వంలో నిలబడి చక్కని చిరునవ్వు చిందిస్తూ తనమాట పాటించక తప్పదని బలవంత పెట్టింది.

అప్పటికి పార్థసారథి భార్య కేవలం తన శ్రేయస్సుకోరి ఆవిధంగా బలవంతం చేస్తున్నదని గ్రహించుకున్నాడు. ఆ సమయంలో దీపాల వెలుగులో విజయలక్ష్మి అతనికొక దివ్య మూర్తిలా గోచరించింది! ఇన్నాళ్లనుంచి ఆమె ఒక సామాన్య స్త్రీ అని అనుకొన్నాడు! ఇప్పుడామె అన్ని విధాల తనవంటి అవిశ్వాసిని సముద్ధరించడం కోసం ఏవో దివ్యలోకం నుండి దిగి వచ్చిన ఒక అపూర్వ దేవతామూర్తి వలె తరళిస్తున్నది! ప్రతి దినము తనతో కలిసిమెలిసి తిరుగుతున్నా ఆమె ఒక వేళ జన్మజన్మాంతరాల నుండి తన వెంట తోడు నీడలా అనుసరించి వస్తున్న ఎవరయినా అమర సుందరి ఏమో ఎవరు చెప్పగలరు!

ఆ విధంగా ఆలోచించిన తరవాత పార్థసారథి మరి ఆమె మాటకాదనలేదు! ఎలాగో అలాగ ఆ బెడద లోనించి తప్పించుకో నిశ్చయించుకుని నెమ్మదిగా నేలమీద మోకరిల్లి సాష్టాంగ నమస్కారంచేసి రెండు మూడు క్షణాలపాటు కళ్లు రెండు మూసుకుని వెంటనే లేచి నిలుచున్నాడు. అయినా విజయలక్ష్మికతని నమస్కారపద్ధతి పూర్తిగా సంతృప్తి కలిగించలేదు! అందుచేత అనుమాన పడి అడిగింది.

'తిన్నగా శ్రద్ధపట్టి చేశారా? లేకపోతే ఊరికే మొక్కుబడి తీర్చుకున్నారా?'

పార్థసారథి పెదవిపై లేత చిరునవ్వు మొలకెత్తింది.

'శ్రద్ధగానే చేదామనుకున్నాను! కాని తీరా కళ్లు మూసుకున్నాక నువ్వే కనిపించావు! అందుచేత నీకే నమస్కారం పెట్టాను!'

ఆ సమాధానం నిజమో వేళాకోళమో అక్కడ నిలుచున్న వారికెవ్వరికి తెలియలేదు! కాని విజయలక్ష్మి క్షణంలో ఆ రహస్యం కనిపెట్టివేసి సన్నసన్నగా మందలించింది.

'తప్పు! తప్పు? అమ్మవారి దగ్గర అలాంటి మాటలన కూడదు! మీకు బొత్తిగా మంచి, చెడ్డ తెలియదు! ముందు రెండు చేతులతోను లెంపలు వేసుకోండి! క్షమాపణ కోరుకుని మళ్లీ వరసగా మూడుసార్లు సాష్టాంగ నమస్కారాలు చెయ్యండి! ఎంతవని చేశారు! మీవి అన్నీ ఇలాంటి పనులే! నా మాటవిని మళ్లీ మూడు సారులు సాష్టాంగ నమస్కారాలు చెయ్యండి! అమ్మవారి కెదురుగా నిలబడి అలాంటి మాటలనవచ్చునా?'

పార్థసారథి కప్పటికిగాని తాను చేసిన తప్పిదం బోధ పడ లేదు. పూజగదిలో మరి వేళాకోళం బాగుండదని ఎంతో చిత్తశుద్ధితో లెంపలు వేసుకుని ప్రగాఢ భక్తి శ్రద్ధలతో నెమ్మదిగా మూడుసారులు సాష్టాంగ దండ ప్రణామాలాచరించాడు.

అవిముగియగానే పూజ గది కవతల నిలబడిన సావిత్రి భర్తవైపు చిలిపిగా చూసి నవ్వుతూ అందుకుంది.

'కాస్త మా ఆయన చేత కూడా గుంజీలు తీయించవమ్మా! అక్కయ్యా! ఈ మధ్యన బొత్తిగా నా మాట వినిపించుకోవడం లేదు!' 'అవును నిజమే సావిత్రీ సమయానికి మహాచక్కని సలహా చెప్పావు!'

ఇక మీ దంపతులిద్దరు సాష్టాంగ నమస్కారం చెయ్యక తప్పదన్నట్టు విజయలక్ష్మి కొంటెగా బావకేసి చూసింది. ఆ పైన అతడు వేళాకోళంగా సావిత్రి నెత్తిమీద ఒక చిన్న మొట్టికాయ వడ్డించబోయాడు! ఆమె క్షణంలో తప్పించుకుని ఆ పక్కనేఉన్న స్తంభంమాటున దాక్కుంది! అయినా కృష్ణమూర్తి తన ప్రయత్నం విరమించలేదు! ఆ తరవాత వారిద్దరు ఆ సావడిలో స్తంభాల మాటున అటు ఇటు తిరుగుతూ రెండు మూడు నిమిషాలపాటు గొల్లస్తంభాలాట కొనసాగించారు. ఆ పైన బాగా అలిసిన ముఖాలతో నెమ్మదిగా నేలమోకరిల్లి సాష్టాంగ నమస్కారా లర్పించారు.

ఆ విధంగా ఏక కాలంలో ప్రణమిల్లిన ఆ దంపతుల అన్యోన్యత గమనించి విజయలక్ష్మి ఎంతయినా ముచ్చటపడింది. అయితే ఇప్పుడామెకేమాత్రము అసూయపడవలసిన అవసరం కలగలేదు! ఆ నాటి పార్థసారథి దంపతుల ఆనందోల్లాసాలో, కృష్ణమూర్తి దంపతుల చిన్నతనం చిలిపి చేష్టలు గమనించి వర్ధనమ్మ ఎంతయినా ఆనందించింది. పసిపిల్లలిదరి చేత నమస్కారాలు చేయించి తానుకూడా సాష్టాంగ నమస్కారం చేసింది.

ఆ సమయంలో విజయలక్ష్మి అపూర్వానందోల్లాసాలలో ఎంతయినా ఉప్పొంగి పోయింది! ఆ కరుణా మూర్తి ఇలువేలుపు కృపవల్లనే అంతటి జబ్బుచేసినా భర్త ప్రాణాలతో బయటపడి, కాపరానికి వచ్చిన కొత్త లాగే తిరిగి తన యెడల ఎంతో ఆప్యాయత కనబరుస్తున్నారని తలుచుకుని తలుచుకుని మాటిమాటికి మురిసి పోయింది.

వాస్తవానికి ఆ విషయంలో విజయలక్ష్మికన్న, మిగిలిన అందరికన్న ఎంతో ఎక్కువ సంతోషించినవాడు కృష్ణమూర్తి. కొంత కాలంపాటు కొన్ని గడు కష్టాలలో చిక్కుకుని సతమత మయినా మొత్తంమీద చిన్నప్పుడు జ్యోతిష్కుడు చెప్పినట్లు విజయలక్ష్మి చాలా అదృష్టవంతురాలని ముమ్ముందు ఇంకా పిల్లలతో పాపతో, భోగభాగ్యాలతో తులతూగ గలదని నిశ్చయించుకుని మరింతగా ఆనందించాడు. ఆమె సర్వదా అలాగే కలకలలాడు తూంటే కళ్లారాచూసి ఆనందించడంకన్నా తనకిక కోరుకోవలసిన దేది లేదని అనుకుని, పరమానందభరితు డయినారు.

ఆనాటి మధ్యాహ్నం ఎంతగా చెప్పినా వినిపించుకోక విజయలక్ష్మి, పసిపిల్లలతోబాటు ఇంటిల్లిపాదికి తానే వంటచేసి వడ్డించింది. భోజనాలయిన తర్వాత మరికొంత సేపు విశ్రమించి కృష్ణమూర్తి సావిత్రితోపాటు ఇంటికి తిరిగిపోవాలని పట్టుపట్టాడు. కాని విజయలక్ష్మి పార్థసారథు లిద్దరు బలవంత పెట్టడంవల్ల అతనికి ఇంకొక రెండు మూడు రోజులవరకు ఆ ఇంట ఉండక తప్పలేదు.

ఆదే సమయంలో విజయలక్ష్మి వెంకటేశ్వరస్వామి మొక్కుబడి సంగతి భర్తతో చెప్పింది. పార్థసారథికి అప్పటికి దైవం ఉనికి మీద గట్టి నమ్మకం కలిగింది. కాని మొక్కుబడి ఒక లంచంలా తోచింది. అందుచేత అతడా యాత్రకంతగా ఇష్టపడలేదు కాని విజయలక్ష్మి చెప్పిన తరువాత అతనికిక అంగీకరించక తప్పలేదు. ఆ మరునాడే సావిత్రితోను, కృష్ణమూర్తితోను కలిసి ఇంటిల్లపాది కొండకి బయలుదేరారు.

యాత్ర ముగించుకొని వచ్చిన వెంటనే పార్థసారథి ప్రభా టాకీస్ యాజమాన్యం స్వీకరించాడు. కొత్తలో కొంత కాలం పాటతనికి ఆ వ్యవహారం అంతా కేవలం యాంత్రికంగా నిర్జీవంగా సాగిపోయినట్టు అనిపించింది. అయితే క్రమ క్రమంగా దాని మీద కొంత అభిరుచి కలిగింది. మరి కొంతకాలం రాత్రింబగళ్లు శ్రమపడిన తరువాత ఖర్చులుపోను నెలకి అయిదారు వందలదాకా మిగిలాయి.

అయితే పార్థసారథికది పూర్తిగా సంతృప్తి కలిగించలేదు. నాటకాలలో మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలని చేసిన ప్రయత్నాలన్నీ ఎందుకు కొరకాకుండా పోయాయని అంతర్యంలో కొంత వ్యథ కలిగింది. తాను కూడా మిగిలిన వ్యాపారస్థులలాగ పొద్దస్తమానము డబ్బు గుంజులాటలోపడి సతమత మయిపోతున్నట్టు తోచింది. అయితే నటనలో తన కంతటి గొప్ప శక్తి సామర్థ్యాలు లేనప్పుడు తానిక చెయ్యగలిగినదేది లేదని కొంతవరకు సమాధానపడ్డాడు. అదేకాక లోకంతోబాటు తోటి నటీనటులలో చాలా మంది సదా ధనసంపాదన కోసమని అంగలారుస్తున్నప్పుడు తానొక్కడు ఒంటరిగా ఏమి చెయ్యగలడు? ఇప్పటికయినా కాస్త కుటుంబం సంగతి ఆలోచించుకోకపోతే ఎలాగ? ఏమిటో! ఊరికే మదన పడడమేగాని నటులలోగాని అభిమానులలోగాని నిజంగా నాటకాలంటే చెవి కోసుకునేవాళ్లు ఎంతి మంది ఉన్నారు! వాస్తవానికి నాటకాలలో కనిపించే నటనకన్న వాటి మీద అభిమానం ఉన్నట్టు మాట్లాడే వారిలోనే ఎక్కువ నటన ఉన్నదని అతనికి తోచింది. ఆ సంగతి ఆలోచిస్తూంటే అతని పెదవిమీద చిరునవ్వు చెంగలించింది.

ఆ సమయంలో అతనికి తాను చిన్నతనంలో చూసిన మహనీయులయిన నటులతోబాటు నిరంతర తపస్సులవంటి వారి నాట్యకళాభినివేశాలు, దేశంలో ఆనాటి పెద్దల ఆదరాభిమానాలు మొదలయినవన్నీ జ్ఞప్తికి వచ్చాయి. ఆరోజులిక తిరిగిరావడం కల్ల అనుకుని ఉసూరుమని నిశ్వసించాడు.

క్రమక్రమంగా మరి కొన్నాళ్లు గడిచిన తరువాత అతనిలో ఒక విచిత్రమయిన పరిణతి కలిగింది. పరిమితమయిన రంగస్థలం విడిచి పెట్టినా తానంతకన్న సువిశాలమయిన జీవిత రంగస్థలంమీద అడుగుపెట్టినట్టు స్ఫురించింది. తోటి మనుష్యుల కష్టసుఖాలు, ఆనందాలు, అసూయలు, ఆశలు, ఈర్ష్యలు, అహంభావాలు, నైచ్యాలు, నిజమయిన హుందాతనాలు, ఔదార్యాలు, చలని స్నేహాలు, విశాలమయిన సానుభూతితో, ఆర్ద్రతతో అవగాహన చేసుకుంటూన్నప్పుడు తానొక సువిస్తృత మహనీయ రూపంలో పాల్గొంటున్నట్టు ఒక విధమయిన గొప్ప ఆనందం కలిగింది. అదే విధంగా తన లోటుపాట్లు, మంచిచెడ్డలు, సుగుణాలు, అవగుణాలు వాటి పరిణామాలు మొదలయినవన్నీ సముచిత సానుభూతితో ఆకళించుకొంటున్నప్పుడు పార్థసారథికి అంతకన్న విచిత్రమయిన అనుభూతి కలిగింది. విశాలమయిన ఔదార్యంతో ఒక ఉత్తమ నటుని ధోరణిలో జీవితంలో పాల్గొనడంకన్న మరి కోరుకోదగిన దేది లేదని క్రమక్రమంగా గ్రహించుకున్నాడు. ఇంచుమించుగా అదే విధమయిన దృక్పథంతో ఆచరణతో అనుదినము తన మనుగడ కొనసాగించుకున్నాడు.

అప్పటినుంచి ప్రభా టాకీస్‌లో చాలా మంది ప్రేక్షకుల కోసం సామాన్య చిత్రా లెక్కువేగా ప్రదర్శించినా అప్పుడప్పుడు నష్టం వచ్చినా లక్ష్యపెట్టక కేవలం కళా దృష్టితో ఉత్తమ చిత్రాలు కొన్ని ఎన్నుకొన్నాడు. రసజ్ఞులయి పౌరుల మన్ననలందుకున్నాడు. మంచి నాటకాలేవయినా ఆ పట్టణానికి వచ్చినప్పుడు విడిచిపెట్టకుండా వెళ్ళి మొట్టమొదటి తరగతిలో ముందు వరసలో కూర్చున్నాడు. అంతగా సొమ్ము చెల్లించుకోలేని నాటక సంఘాలకు చాలా తక్కువ అద్దెతోనే ప్రభాటాకీస్‌లో ప్రదర్శన సౌకర్యం కలిగించాడు. ఔత్సాహిక సంఘాల దగ్గర ఆ మాత్రం కూడా వసూలు చెయ్యలేదు. వారు ప్రదర్శించే నాటకాలన్నిటికి వెళ్ళి యథాశక్తిగా సాయపడి ప్రోత్సహించాడు. వారి నాటకాలు చూస్తున్న సమయంలో అతనికి అప్పుడప్పుడు సరోజ వ్యవహారం అంతా జ్ఞాపకం వచ్చింది. గుండెల్లో లోపల గుచ్చుకున్న గాజు పెంకు నలుసులాగ కళుక్కుమని వేధించింది. కాని క్రమక్రమంగా కొంత సానుభూతితో ఆమె ప్రవర్తన అంతా అవగాహన చేసుకున్నాడు. 'సరోజ [illegible]సలో మాత్రం అంత పెద్ద తప్పేముంది! ఆమె పరిస్థితులలాంటివి!' అని సరిపెట్టుకున్నాడు. అందువల్ల ఆమెమీద ఏర్పడిన వైరస్య[illegible]డా తొలగిపోయింది.

ఇక విజయలక్ష్మిని తలచుకున్నప్పుడు పార్థసారథికి నిజానికామె తన జీవితానికంతటికి 'విజయలక్ష్మి' అన్న ఆనందం కలిగింది. అందుచేత దైనందిన జీవితంలో ఆమె లోటుపాట్లేవి అతనికి స్ఫురించనేలేదు. ఒక్కొక్కప్పుడవి కనబడిన ఆర్ద్రమయిన సానుభూతితో అవగాహన చేసుకుని ఆదరించాడు. ప్రభాటాకీస్ యాజమాన్యం స్వీకరించినప్పటినించి అతడేవిధంగాను విజయలక్ష్మి మనస్సు నొప్పించలేదు. తన సంసారమేమో! తన యజమాన్యమేమో! అంతే! ఎప్పుడయినా భార్యతోను కృష్ణమూర్తి దంపతులతోను కలిసి నూతన నాటకాలు, కొన్ని కొత్త చిత్రాలు చూశాడు. ఆ పట్టణంలో నటీ నటులెవరయిన తగినంత ఉపాధిలేక లేమితో బాధపడుతున్నారని తెలిస్తే చేతనయినంత వరకు వారినాదుకున్నాడు.

అప్పుడప్పుడు భార్యతో కలిసి కృష్ణమూర్తి ఇంటికి వెళ్ళి దంపతులనిద్దరిని ఉట్టిపడుతున్న ఆప్యాయతతో పలకరించాడు. ఏమయినా అనుకుంటారేమో అని విజయలక్ష్మి చేత గుంభనగా కొంత ధన సహాయం చేయించాడు. ఇక ఇంటికి సంబంధించిన వ్యవహారాలన్నీ పూర్తిగా విజయలక్ష్మికే అప్పగించాడు. ప్రభాటాకీస్ నిర్వ

హణలో కూడా అడుగడుగునా ఆమె సలహా తీసుకున్నాడు అంతే కాదు! విజయలక్ష్మితో సంప్రదించనిదే ఏ పని తలపెట్టలేదు.

ఆమె అంతలోనే అతనిలో అంత విచిత్రమయిన మార్పు రాగలదని కలలోకూడా అనుకోలేదు! ఎప్పటికయినా తిరిగి సరోజతో కొంత అనుబంధం కలుగకపోతుందా అని రవంత అనుమాన పడకపోలేదు. కాని అయితే అతడిక ఆ విషయమే తలపెట్టలేదు! పార్థసారథికి జబ్బుచేసి నిమ్మళించినప్పటినుండి అలాంటి విషయాలలో ఆమెకొక విధానమయిన విరక్తిస్థితి కలిగింది. భర్త పదికాలాలపాటు అలాగా ఆరోగ్యంగా క్షేమంగా ఉంటేనే చాలునని తనకదే పదివేలని సంతృప్తి పడింది. అందుచేత అతడెక్కడికి వెళ్ళినా ఎప్పటికి తిరిగివచ్చినా ఇదేమని అడగాలనే ఆలోచించలేదు! తన యెడల ఏ మాత్రం ఆదరం చూపించినా అదే మహద్భాగ్యమని ఆనందించింది. ఆ విధంగానయినా తన సంసారం సుఖంగా సాగిపోతే చాలునని అంతర్యంలో ఎంతయినా ఉప్పొంగిపోయింది!

అందుచేత పార్థసారథి ఎన్నడు మరి సరోజ మాటే తలపెట్టకపోతే మరింతగా ఆశ్చర్యపడి ఆనందించింది. అమ్మవారి చలవ వల్లనే తన కంతటి గొప్ప అదృష్టం కలిగిందనుకుని పూజా పునస్కారాలన్నీ ఇనుమడించిన భక్తి శ్రద్ధలతో నిర్వహించింది. పార్థసారథి పరిపూర్ణ ప్రేమ చూరగొన్నా అతనినెన్నడు అవంతయినా ఉపేక్షించలేదు. చిరకాలం లేమితో బాధపడిన నిరుపేద పెన్నిధి నంటిపెట్టుకున్నట్టు పెంపెక్కిన ప్రేమశక్తితో పార్థసారథి కన్నివిధాల అనువర్తనగా ఉండి మరింతగా అతని ఆదరణ భాగ్యం చూరగొన్నది. ఇంచుమించుగా ప్రభా టాకీస్ యాజమాన్యం స్వీకరించినప్పటినుంచి వారి జీవిత ప్రవాహాలేకీభవించి ఒకే ప్రశాంత ప్రవంతిగా సాగిపోయాయి. ఎంతగా టాకీస్ యాజమాన్యం పనులలో చిక్కుకొన్నా పార్థసారథి ఒక్కనాడు ఇంటికాలస్యంగా రాలేదు. ఒకవేళ ఏదయినా అత్యవసరమయిన పని తగిలితే ముందుగా ఆమెతో చెప్పి సరీగా అన్నసమయానికే తిరిగివచ్చాడు. అందుచేత భర్త రాకకోసమని ఎన్నడు నిమిషకాలమయినా నిరీక్షించలేదు విజయలక్ష్మి.

—సమాప్తం


# వ్యాపార ప్రకటనలకు సదవకాశం

'ఆంధ్ర ప్రదేశ్' మాసపత్రిక రాష్ట్రంలో మారుమూల గ్రామాలకు సైతం పోతున్నది
రైతుల, కార్మికుల, మేధావుల అభిమాన పత్రిక

# ఆంధ్రప్రదేశ్

ప్రకటన రేట్లు:

3 వ కవరు రూ. 500: 4 వ కవరు రూ. 600
లోపలి పేజీ రూ. 400 అర పేజీ రూ. 250

## సాలు చందా రూ. 6-00 విడిప్రతి 50 పైసలు

వివరాలకు:
డైరెక్టరు, సమాచార పౌర సంబంధ యాంత్రిక శాఖ
హైదరాబాదు—1




CMCF-3-203 TEL

# పండుగలూ పర్వదినాలూ

—కమలా త్రివేణి

## మహా శివరాత్రి

అనాడు మాఘ బహుళ చతుర్దశి. అనాడు జ్యోతిర్లింగం ప్రభవించిన మహా పర్వదినం.

అతిథి అనాడే ఒకసారి ఒక బోయవాడు శత్రువులచేత బంధింపబడ్డాడు. పగలంతా పస్తుపడి ఉన్నాడు. వానిని సాయంకాలం విడిచి పెట్టారు. ఆకలితో అడవిలో ప్రవేశించాడు. ఒక చెట్టుమీద కూర్చున్నాడు. అది బిల్వ వృక్షం. చెట్టుకొమ్మలు కదలిస్తూ ఉంటే బిల్వ పత్రాలు క్రింద రాలాయి. చెట్టు మొదట ఒక గుప్త లింగం ఉంది. ఆ లింగం మీద పడ్డాయి బిల్వ పత్రాలు. ఆ రాత్రి అంతా అలా గడిచి పోయింది. ఆ రాత్రి ఒక ఆడు జింక వాని కంట బడింది. దానిని బాణంతో చంపబోయాడు నన్ను కాదు ఇంకొక జింక వస్తుంది దాన్ని చంపమంది. అంతలోనే ఒక ఆడ జింక ఒక మగ జింక వచ్చాయి. అవన్నీ కలసి తమను చంపుమని వేట గానిని వేడుకొన్నాయి. ఆ వ్యాధుడు ఆశ్చర్య పోయాడు. ఆ జంతువులను, ఆ మానవుని శివుడు అనుగ్రహించాడు. వారందరు కైలాసం చేరుకున్నారు.

అనాడు బోయవాడు పస్తుపడి ఉండ వలసి వచ్చింది. దాని వల్ల ఉప వాస ఫలితం ప్రాప్తించింది. ఆ రాత్రి జాగరణం చేసి నట్టయింది. మారెడు పత్రి శివలింగం మీద పడినందున శివపూజా ఫలితం కలిగింది. ఇదంతా అనిచ్ఛా పూర్వకంగా జరిగింది. మహా శివరాత్రి వ్రతం బుద్ధి పూర్వకంగా, శ్రద్ధా భక్తులతో చేస్తే ఎంత ఫలితం వస్తుందో మరి.

## ముహరమ్

అనాడు ముహరమ్ నెల 10 వ రోజు, క్రీస్తు శకం 680వ సంవత్సరం అక్టోబరు 19వ తేదీ. అనాడు కర్బలా మైదానంలో క్రౌర్యం తాండవించింది నిర్దయత్వం నృత్యం చేసింది ఆ యుద్ధ భూమిలో హుసేన్, ఆయన సహచరులు మరణించారు.

ముహమ్మద్ ప్రవక్త పరమ పదించిన తరువాత 4 గురు కలీఫాలు (ఇస్లామ్ మత గురువులు) అయ్యారు. వారు గతించిన తరువాత యాజిద్ మతపీఠాన్ని ఆక్రమించాడు ముస్లిము లందరూ తనను మతాధిపతిగా గుర్తించాలని నిర్బంధించాడు.

మత పీఠానికి న్యాయమైన హక్కు హుసేనుది. ఆయన ముహమ్మద్ ప్రవక్త దౌహిత్రుడు. యాజిద్ ఆధిపత్యాన్ని అంగీకరించ లేదు హుసేను. కూఫా ప్రజలు ఆయనకు సాయం చేసామన్నారు. వారిని నమ్మి హుసేన్ కుటుంబంతో చిన్న పరివారంతో బయలు దేరాడు.

దారిలోనే అడ్డగించింది యాజిద్ సైన్యం—మూడు వేల సంఖ్యా బలం గల సైన్యం. హుసేన్ అనుచరులు ముప్ఫయి ఇద్దరు అశ్వికులు, నలభైమంది కాల్బలం.

హుసేన్ గుర్రాన్ని అధిష్ఠించాడు. ఒక చేత ఖడ్గం. ఒక చేత కురాన్ పట్టాడు. దూరంనుంచి శత్రువులు బాణవర్షం కురిపించారు. ఒక్కొక్క గుర్రం, ఒక్కొక్క సైనికుడూ నేలకు ఒరిగారు. తుదకు హుసేన్ మిగిలాడు. ఏకాకియై, గాయపడి, బడలి పోయి ఆయన గుడార ద్వారం దగ్గర చతికిల పడ్డాడు గుక్కెడు నీళ్ళు తాగ బోతూఉంటే బాణం వచ్చి నోటిలో గుచ్చుకొంది. ఈటె పోటులు, కత్తి పోటులు ముప్పయిమూడు తగిలాయి హుసేను అసువులు విడిచాడు

ఈ ఘోర కృత్యాన్ని జ్ఞాపకం చేసుకొడానికే ముహరమ్ జరువుకొనేది హిందు ముస్లింమ్ సామరస్యానికి దోహదం చేస్తుంది ముహరమ్ సంప్రదాయం.

## హోలీ

అనాడు ఫాల్గున శుద్ధ పూర్ణిమ. ప్రహ్లాదునితో విసిగి వేసారి హిరణ్య కశిపుడు అతనిని దగ్ధం చేయాలని సంకల్పించుకొన్నాడు. హోలిక హిరణ్య కశిపుని సోదరి. ఆమె అగ్ని స్తంభన విద్య నేర్చిన ఖేచరి. ఆమె అగ్నిలో కాలదు. ప్రహ్లాదుని ఒడిలో కూర్చుండ బెట్టుకొని నిప్పులో ప్రవేశించింది. భగవానుని అనుగ్రహం వల్ల ప్రహ్లాదునికి ఎట్టి అపాయము కలుగ లేదు. హోలికయే దగ్ధమై పోయింది. హోలీ పర్వంనాడు జరిపే హోలికా దహనానికి సంబంధించిన గాథ ఇదే. పుణ్యం పాపాన్ని జయిస్తుందని. దైవశక్తికి రాక్షస శక్తి లొంగిపోక తప్పదని ఈ గాథ చెప్పే నీతి.

## గుడ్ ఫ్రైడే

ఆ నాడు శుక్రవారం, మానవజాతి పాప పరిహారార్థం యేసు క్రీస్తు ప్రాణార్పణం చేసిన శుక్రవారం.

ఆ నాటి ఉదయం రోమన్ గవర్నర్ పైలేట్ ఎదుట ఒక ఖైదీని ప్రవేశ పెట్టారు. ఆయన తాళ్ళతో కట్టుబడి అలసిపోయి ఉన్నాడు. ఆయన పరమపవిత్రుడైన యేసుక్రీస్తు. తనను యూదుల రాజుగా అనుకుంటున్నాడనీ. రోమన్ రాజ్యాన్ని పడద్రోయడానికి ప్రయత్నిస్తున్నాడనీ ఆయన మీద ఆరోపణ.

"నీవు యూదుల రాజువా ?" అని అడిగాడు పైలేట్ "నువ్వే అంటున్నావు" అన్నాడు యేసు.

ఆయనలో దోషం ఏమీ కనబడలేదు న్యాయమూర్తికి. ఐనా యేసును సిలువ వేయాలని పట్టుపట్టారు యూదులు. కల్వరి గిరి మీద ఆయనను సిలువ వేశారు. ఆ సంఘటనకు స్మారకమైన దినమే గుడ్ ఫ్రైడే. ఆ తరువాతి ఆదివారం ఈస్టర్. ఆ నాడు యేసు పునరుత్థానం చెందిన రోజు.



# నగరంలో ...

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు



డా. బి. గోపాలరెడ్డి అధ్యక్షతన సాహిత్య అకాడమీ బహుమతి ప్రదాన సభ

సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన మూడు పుస్తకాలను సాహిత్య అకాడమీ హాలులో జరిగిన సభలో అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి జనవరి 30 న ఆవిష్కరించారు.

ఆ మూడు గ్రంథాలు :— శబ్దరత్నాకరంలో లేని, వాణిజ్య సాంకేతికేతర శబ్దాలతో, శ్రీ యం కోదండ రామిరెడ్డి సంపాదకత్వాన వెలువడిన "మాండలిక పదకోశం", శ్రీ చల్లా సూర్యనారాయణమూర్తి హిందీలో అనువదించిన "ఆధునిక తెలుగు కవిత", (20 మంది తెలుగు కవుల కవితలకు హిందీ అనుకరణ) శ్రీ మహమ్మద్ హుస్సేన్ వ్రాసిన "దక్కనీ ఉర్దూ" (దక్కన్ ఉర్దూ పదకోశం).

ప్రసిద్ధ తెలుగు రచయితలు ప్రొఫెసరు పింగళి లక్ష్మీకాంతం, శ్రీశ్రీ, చలం, ముగ్గురికీ సాహిత్యఅకాడమీ విశిష్ట సభ్యత్వాన్నిస్తూ బంగారు చిహ్నాలను, శాలువలను శ్రీ గోపాలరెడ్డి బహూకరించారు.

సాహిత్య విమర్శకు ప్రొఫెసర్ పింగళి లక్ష్మీకాంతం, కవిత్వానికి కీ॥ శే॥ బాలగంగాధర తిలక్, చిన్న కథా రచనకు అవసరాల రామకృష్ణారావు, నవలా రచనకు శీలా వీర్రాజు. మహిళా రచయితలలో శ్రీమతి స్థానపతి రుక్మిణమ్మగార్లను యీ ఏటి ఉత్తమ రచయితలుగా ఎన్నికచేసి వారికి రూ. 1116లను బహూకరించారు. సాహితీ లోకానికి శ్రీ పింగళి లక్ష్మీకాంతం చేసిన సేవలను అధ్యక్షులు కొనియాడారు. యి. మీదట ఉత్తమ నాటక రచనకు కూడా అకాడమీ పక్షాన బహుమతి ఏటేటా ఇవ్వనున్నట్లు ఆయన ప్రకటించారు



హైదరాబాదులో అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనకు ఫిబ్రవరి 1వ తేదీన ముఖ్యమంత్రిచే ప్రారంభోత్సవం



జనవరి 23వ తేదీన గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయ్ ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమిషను ప్రాంతీయ మహాసభకు హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు



ఆంధ్రప్రదేశ్ లో పర్యటించిన కాశ్మీరు బృందం (విద్యార్థులు, రైతులు) సభ్యులతో సమాచారశాఖ మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు, యాత్రా విషయాల మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీగారలు. (ఫిబ్రవరి 12)



## గ్రామీణ నీటి సరఫరా పథకానికి ఉపముఖ్యమంత్రిచే శంకుస్థాపన

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు, కరీంనగరం జిల్లా కోరట్ల గ్రామంలో రూ. 8.88 ...ప్పు కాగల గ్రామీణ నీటి సరఫరా పథకానికి ...స చేశారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభలో ఆయన ...తూ, రాష్ట్రంలో త్రాగు నీటి సమస్యను పరిష్కరించ ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నదని చెప్పారు. ఆంధ్రప్రదేశ్‌లో మూడవ ప్రణాళిక కాలంలో ప్రజారోగ్య పంచాయతీరాజ్ శాఖల ద్వారా నీటిసరఫరా పథకాలకు రూ. 10.89 కోట్లు ఖర్చు పెట్టడం జరిగిందని ఆయన చెప్పారు. అంతేగాక తెలంగాణా మిగులు నిధుల నుంచి రూ. 86 లక్షలు, మునిసిపాలిటీల నుంచి రూ. 77 లక్షలు, రక్షిత నీటి సరఫరా పథకాలకు, గ్రామీణ నీటి సరఫరా పథకాలకు ఖర్చు పెట్టడం జరిగింది. ఈ సంవత్సరం, త్రాగునీటి సరఫరా పథకాల అమలుకొరకు ప్రజారోగ్య శాఖ రూ. 66 లక్షలు, పంచాయతీరాజ్ శాఖ 73 లక్షలు తెలంగాణా మిగులు నిధుల నుంచి రూ. 51.34 లక్షలు ఖర్చుపెట్టడం జరుగుతుంది. నాల్గవ పంచవర్ష ప్రణాళిక ముగిసే నాటికి ఆంధ్రప్రదేశ్‌లో త్రాగునీటి సమస్య పరిష్కరించ బడుతుందని ఉపముఖ్యమంత్రి చెప్పారు.

కోరుట్ల గ్రామంలో ప్రజలకు ఈ పథకం వల్ల తల 1 కి 40 గ్యాలనుల నీరు సరఫరా అవుతుంది. ఇక్కడి జనాభా ఒక వేళ రెట్టింపు అయినప్పటికి కూడా తగినంత నీరు సరఫరా కాగలదని ఆయన చెప్పారు. 1970 జూన్ నాటికి మెట్టుపల్లి తాలూకాలో 26,000 ఎకరాల భూమికి నీటిపారుదల సౌకర్యం లభిస్తున్నందుకు ఉపముఖ్యమంత్రి ఆ తాలూకా ప్రజలను అభినందించారు. తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి నిధుల వినియోగాన్ని గురించి ప్రజలు అనుమాన పడనక్కరలేదనీ, తెలంగాణా జిల్లాలకు కేటాయించిన రూ. 9 కోట్లు సకాలంలో ఖర్చుకాగలవనీ, ఆయన చెప్పారు. 1970 మార్చి నాటికి కరీంనగరం జిల్లాలో 32.5 శాతం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుందని ఆయన చెప్పారు. మెట్టపల్లిలో మున్సిఫ్‌కోర్టును స్థాపించే విషయమై పరిశీలించగలనని ఆయన హామీ ఇచ్చారు. ఈ త్రాగునీటి సరఫరా పథకం సకాలంలో పూర్తి అవుతుందని కలెక్టరు హామీ ఇచ్చారు.

## వేములవాడ దగ్గర వంతెనకు ప్రారంభోత్సవం

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు కరీంనగరం జిల్లాలో వేములవాడ దగ్గర 9.54 లక్షల ఖర్చుతో మూల వాగు పై నిర్మించిన వంతెనకు జనవరి 31 న ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగసభలో మాట్లాడుతూ, ఈ వంతెన నిర్మాణానికి చొరవతీసుకొని కృషిచేసిన శ్రీ రాజ రాజేశ్వరస్వామి దేవాలయ సంఘ సభ్యులను ఆయన అభినందించారు.

సిరిసిల్ల తాలూకా ప్రజలు గ్రామీణ విద్యుత్ సహకార సంఘాన్ని నెలకొల్పినందుకు ఉపముఖ్యమంత్రి ఆ తాలూకా ప్రజలను అభినందించారు. దీనికి అమెరికా ఆర్థిక సహాయం లభించింది. ప్రజలు అంతరంగిక విభేదాలను విస్మరించి అభివృద్ధి పనులలో ఐకమత్యంతో కృషిచేయాలని ఆయన ఉద్బోధించారు.

## పంచాయతీ ఘర్‌కు ప్రారంభోత్సవం

నల్గొండ జిల్లా కలెక్టరు శ్రీ గ్రోవర్ జనవరి 31 వ తదీన భువనగిరి పంచాయతీ సమితిలోని జలాల్‌పూర్ గ్రామంలో సుమారు రూ. 8,744 ల వ్యయంతో నిర్మించిన పంచాయతీ ఘర్‌కు ప్రారంభోత్సవంచేశారు.



హిందూపురులో వ్యవసాయ పారిశ్రామిక ప్రదర్శనకు ఉపముఖ్యమంత్రిచే ప్రారంభోత్సవం



జగిత్యాల పంచాయతీ సమితిలోని అలీపూర్ గ్రామంలో ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావుచే విద్యుచ్ఛక్తికి ప్రారంభోత్సవం



ఫిబ్రవరి 6వ ఉప ముఖ్యమంత్రి ఇబ్రహీంపట్నంలో భూమిలేని పేదల సమావేశంలో ప్రసంగించారు

కలెక్టరు అధ్యక్షోపన్యాసంచేస్తూ, నూటికి నూరుపాళ్లు పన్నులు వసూలు చేసినందుకు గ్రామసర్పంచ్ శ్రీ కె కూచిరెడ్డిని అభినందించారు.

సేద్యపు నీటి బావులను లోతు చేయడానికి, మంచి నీటి సమస్యను పరిష్కరించడానికి వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషను నుంచి ఒక రిగ్గును సరఫరా చేయించడానికి కలెక్టరు హామీ యిచ్చారు.

## విద్యుచ్ఛక్తి శాఖ పనివారలకు ప్రోత్సాహక బోనసు : కార్మిక మంత్రి ప్రకటన

కార్మికశాఖ మంత్రి శ్రీ జి. సంజీవరెడ్డి, కొత్తగూడెంలోని బ్లాకు సమాచార కేంద్రంలో ఆంధ్రప్రదేశ్ కాలరీల మజ్దూరు సంఘం పదవ వార్షిక సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ, కార్మికుల కోరికలు ఎప్పటికప్పుడు కొత్తగా ఉంటూఉంటాయనీ, సమాజంలో సంపత్తి పంపిణీ సమానంగా ఉండకపోవడమే దీనికి కారణమనీ అన్నారు. ఐ.ఎన్.టి.యు.సి. తాను నిరంతర కృషిచేసిన ఫలితంగా విద్యుచ్ఛక్తి శాఖలో ప్రప్రథమంగా పనివారలకు 4 శాతం ప్రోత్సాహక బోనసును ప్రభుత్వం మంజూరు చేసిందని ఆయన ప్రకటించారు. వేతన నిర్ణాయక సంఘం తమ సిఫార్సులను ప్రకటించిన తక్షణం వాటిని అమలు పరిచేవిధంగా పరిశ్రమల యాజమాన్యంపై ప్రభుత్వం ఒత్తిడి తెస్తుందని ఆయన అన్నారు.

ప్రభుత్వం త్వరలోనే మంజూరుచేయనున్న వేతనాలలో 15 శాతం పెంపుదలను అంగీకరించాలని వివిధ పారిశ్రామిక పనివారలకు ఆయన విజ్ఞప్తి చేశారు.

సంఘాల సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకుని వ్యక్తిగత యిష్టాయిష్టాలను విడనాడాలని ఆయన సూచించారు.

పాల్వంచలో బహిరంగ సభలో మంత్రి ప్రసంగిస్తూ పారిశ్రామిక యూనిట్లు పనిచేసే ప్రాంతానికి చెందిన వ్యక్తులకు ఉద్యోగాల విషయంలో ప్రాధాన్యం యివ్వబడుతుందని అన్నారు. కార్మికులు కోరే పక్షంలో పాల్వంచలో ఇ.ఎస్.ఐ. ఆసుపత్రి ఏర్పాటుకు తాను అంగీకరిస్తానని ఆయన వెల్లడించారు. పరిశ్రమలో తాత్కాలిక కార్మికులు, ఎన్.ఎం.ఆర్. ఉద్యోగాల నియామకాన్ని ఆయన వ్యతిరేకించారు. కొత్త చట్టంలో యీ పద్ధతికి స్వస్తి చెప్పబడుతుందని ఆయన పేర్కొన్నారు.

## నాల్గవ ప్రణాళికలో రక్షిత నీటి సరఫరా పథకాలకు ప్రాధాన్యత

ఆర్థిక మంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి చి.. సమీపంలో మహాసముద్రం గ్రామంలో రక్షిత నీటిసరఫరా ప.. కానికి ప్రారంభోత్సవం చేస్తూ, నాల్గవ ప్రణాళికలో అంచెలవారిగా రక్షిత త్రాగునీటి పథకానికి ప్రాధాన్యత ఇచ్చే విషయమై రాష్ట్ర ప్రభుత్వం యోచిస్తున్నదని తెలియజేశారు. కలెక్టరు శ్రీ బి. వి రామారావు అధ్యక్షత వహించారు.

రాయలసీమ, తెలంగాణా వంటి వెనుకబడ్డ ప్రాంతాల అభివృద్ధి ప్రత్యేక శ్రద్ధ వహించి రాష్ట్రాభివృద్ధి సాధించాలని మంత్రి వక్కాణించారు. త్రాగునీటి సరఫరా, చిన్నతరహా నీటి పారుదల వనరుల మరమ్మత్తు, కమ్యూనికేషన్లు పథకాలను రెండు మూడేండ్లలోపల పూర్తి చేయడానికి వీలుగా, వీటికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడానికి ప్రత్యేకశ్రద్ధ జరుగుతుందని ఆయన చెప్పారు.

ముఖ్యంగా డెల్టాకాని ప్రాంతాలలో భారీఎత్తున రైతులకు సహాయపడేందుకు గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలను అమలుపరచడానికి ఆర్థిక వనరుల విషయం చర్చించేందుకు జాతీయం చేయబడిన బ్యాంకుల ప్రతినిధులతో ఒక సమావేశం ఏర్పాటుచేయబడుతుందని మంత్రి వెల్లడిచేశారు. ఇప్పుడు వున్న సౌకర్యాలను ఉపయోగించుకొని గ్రామీణ పరిశ్రమాభివృద్ధికి కృషిచేయవలసిందని గ్రామీణ విద్యాధికులకు ఆయన వినతిచేశారు. రాయలసీమలో నీటివనరులు యెక్కువ లేకపోవడంవల్ల ప్రజలజీవన స్థాయిని పెంచేందుకు ఇక్కడ పరిశ్రమలు నెలకొల్పవలసిన అవసరం ఎంతైనా వుందని ఆయన చెప్పారు.



నిజామాబాదు యువ రచయితల సమాఖ్య "ఇందూర్ భారతి" ప్రథమ వార్షికోత్సవం

సర్వశ్రీ డి.యన్. విశ్వనాథరెడ్డి, జిల్లా పరిషత్తు అధ్యక్షులు, డి. వి. చంద్రశేఖరరెడ్డి, యన్. జయపాల్‌రెడ్డి, వి. మునిస్వామి, యం. యల్. ఏ. లు, జిల్లా పరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ పి. రామలింగా రెడ్డి గారలుకూడా మాట్లాడారు.

## శ్రీకాకుళం జిల్లాలో పరిశ్రమల అభివృద్ధి

్రి పరిశ్రమల శాఖా డైరెక్టరు, శ్రీ అబిద్ హుస్సేన్, డైరెక్టరు శ్రీ ఎ. వి. ఎన్. రాజు, శ్రీకాకుళం జిల్లా శ్రీ బి యస్. యుగంధర్, జిల్లాలో పరిశ్రమల స్థాపనకు కాశాలను గూర్చి శ్రీకాకుళం జిల్లాకు చెందిన పారిశ్రామిక ు, వాణిజ్య వేత్తలతో చర్చలు జరిపారు.

జిల్లాలో లభించే పారిశ్రామిక వనరులను దృష్టిలో ఉంచుకొని యీ జిల్లాలో ప్లాస్టిక్ వస్తువులు, జీడిమామిడి పరిశ్రమ, అనాస పండ్ల పరిశ్రమ, మామిడి రసంనుండి చాక్‌లెట్ల తయారీ పరిశ్రమ మొదలైన వాటిని ఏర్పాటు చేయవచ్చునని డైరెక్టరు సూచించారు.

## నాగారంలో కార్మిక మంత్రిచే విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం

కార్మిక శాఖా మంత్రి శ్రీ జి. సంజీవరెడ్డి, వరంగల్ జిల్లా, జనగామ పంచాయతీ సమితిలోని నాగారం గ్రామంలో విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు. ఆయన ఈ సందర్భంలో ప్రసంగిస్తూ విద్యుచ్ఛక్తిని చక్కగా వినియోగించుకొని వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికి తీవ్రంగా కృషి చేయాలని ప్రజలను ఉద్బోధించారు.

## తూర్పుగోదావరిజిల్లా తెలుగు రచయితల మహాసభ

తూర్పు గోదావరి జిల్లా తెలుగు రచయితల మహాసభ కాకినాడ సూర్యకళా మందిరంలో జనవరి 10, 11 తేదీలలో జరిగింది.



జనవరి 21వ, తేదిన పర్యాటక విషయాలశాఖ మంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీ విశాఖపట్నంలో లగ్జరీకోచ్ "లేపాక్షి"కి ప్రారంభోత్సవంచేశారు

అఖిల భారత తెలుగు రచయితల మహాసభ కార్యదర్శి శ్రీ పోతుకూచి సాంబశివరావు సభలను ప్రారంభించారు. ప్రారంభోత్సవ సభకు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ) అధ్యక్షత వహించారు. శ్రీ యుతులు జమ్మలమడక మాధవరామ శర్మ, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ప్రభృతులు మహాసభలలో పాల్గొని ప్రాచీనాధునిక సాహిత్యాలను గురించి ప్రసంగించారు. ఈ సందర్భంలో జరిగిన గ్రంథ ప్రదర్శనను శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి ఆవిష్కరించారు. ప్రత్యేక సంచికను శ్రీ పాలగుమ్మి పద్మరాజు ఆవిష్కరించారు. విభిన్న సాహిత్యరీతులపై శ్రీ మహీధర రామ్మోహనరావు అధ్యక్షతన జరిగిన సదస్సులో శ్రీయుతులు బుద్ధవరపు వెంకటరత్నం, (కథానిక) 'జానకీజాని' (వచన కవిత) రామకృష్ణ భరద్వాజ (ఛందోబద్ధ కవిత), రావులపర్తి భద్రరాజు, వక్కలంక లక్ష్మీపతిరావు ప్రభృతులు ప్రసంగించారు.

శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు అష్టావధానం నిర్వహించారు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ప్రసంగాన్ని శ్రీ పద్మరాజు చదివి వినిపించారు. కవి సమ్మేళనం, భువన విజయం, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలూ నిర్వహించబడినవి.

## "ప్రాంతీయ అసమానత్వాలను తొలగించండి"

లఘు పరిశ్రమల మంత్రి శ్రీ జి. సి. వెంకన్న ఇటీవల గుంటూరులో జిల్లా పరిషత్ కార్యాలయంలో జిల్లా లఘుపరిశ్రమల మహా సభలో మాట్లాడుతూ పరిశ్రమల వికేంద్రీకరణ జరగాలనీ, నగరాలలో కేంద్రీకరించకుండా గ్రామాలలో వ్యవసాయ పరిశ్రమలు స్థాపించాలనీ చెప్పారు. ఆధునిక సాంకేతిక విషయాలను ప్రజలకు తెలియజేసేందుకు జోనల్ స్థాయిలో త్వరలో సాంకేతిక విభాగం తెరవడం జరుగుతుందని ఆయన వెల్లడించారు.

కొద్దిమంది పారిశ్రామికులకు మాత్రమే లాభం కలగాలని ప్రభుత్వం భావించడం లేదు. అధిక సంఖ్యలో పారిశ్రామిక వేత్తలను ప్రోత్సహించి ప్రజలకు చౌక ధరలో ఎక్కువ పారిశ్రామిక వస్తువులను లభింపచేయడమే ప్రభుత్వ పారిశ్రామిక విధానమైయున్నదని మంత్రి చెప్పారు. సులభంగా ముడి సరుకులు లభిస్తున్నప్పుడు వాటిని ఉపయోగించే పరిశ్రమలు స్థాపించాలనీ, పారిశ్రామికంగా వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడానికి వీలుగా ప్రత్యేక సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం యోచిస్తున్నదని ఆయన అన్నారు

## లిఫ్టు ఇరిగేషన్ పథకానికి ప్రధాన కార్యదర్శిచే శంకుస్థాపన

"రైతులు తమ ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచుకోవడానికి ఆహార ధాన్యాలను ఎక్కువగా పండించడమేగాక వారు వాణిజ్య పంటలను కూడా పండించాలి" అని ప్రధాన కార్యదర్శి శ్రీ యం. టి. రాజు జనవరి 30వ తేదీన మెదకు పంచాయతీ సమితిలో కొడపాక గ్రామంలో మంజీరపైన లిఫ్టు ఇరిగేషన్ పథకానికి శంకుస్థాపనచేస్తూ ఉద్బోధించారు. ఈ పథకానికి రు. 7 లక్షలు ఖర్చు అవుతుంది.

**Statement About Ownership And Other Particulars About**

**"ANDHRA PRADESH"**

FORM-IV

(*See Rule* 8)

| | | |
|---|---|---|
| Place of Publication | : | Hyderabad. |
| Periodicity of Publication | : | Monthly. |
| Printer's Name | : | Director, Government Printing. |
| Nationality | : | Indian. |
| Address | : | Chanchalaguda, Hyderabad-24. |
| Publisher's Name | : | P. Vaman Rao. |
| Nationality | : | Indian. |
| Address | : | Director, Department of Information, Public Relations and Tourism, Hyderabad, A.P. |
| (Chief) Editor's Name | : | P. Vaman Rao. |
| Nationality | : | Indian. |
| Address | : | Director, Department of Information, Public Relations and Tourism, Hyderabad, A.P. |
| Name and address of individuals who own the Newspaper and partners or share-holders holding more than one per cent of the total capital. | | Nil. |

I, P. Vaman Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) P. VAMAN RAO,

*Signature of the Publisher.*

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS AND TOURISM, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD

# రిపబ్లిక్ దినోత్సవాలు

## 1970



రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా ఢిల్లీలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటుచేసిన ''బతకమ్మ'' శకట ప్రదర్శన బృందం సభ్యులతో రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి.



ఢిల్లీ పురవీథులలో "బతకమ్మ" శకట ప్రదర్శన దృశ్యం

**Reg. No. H. 133**

